

# ఇదీ... స్వాగతం !!

జి.వి.జి.కె. చంద్రమౌళీశ్వరరావు

# ఇది... స్వగతం !!



**జి.వి.జి.కె. చంద్రమౌళీశ్వరరావు**

(మెహెర్‌చంద్ర)

ఎడిటర్ & పబ్లిషర్ - అవతార్ మెహెర్, నూజివీడు.

# ప్రసూన - మెహెర్‌చంద్రల

## వివాహ స్వర్ణోత్సవం





**16-11-2003**

మెహెర్ నిలయం, నూజివీడు

***Remember me whole Heartedly***
***Repeat my name whole Heartedly***
***Love me constantly***
***I will Help you.***

***- MEHER BABA***

ఈ మధ్య ఏదో తెలియని ప్రేరణ నాలో చెలరేగింది. ఆంధ్రా సెంటరు అధ్యక్షులు సో. చింతాసాయిబాబా నా గురించి, అడుగడుగునా నేను బాబా ప్రేమపరిధిలోనికి వచ్చిన వైనం గురించి చాలాసార్లు ప్రశ్నించారు. అలాగే నాకుమారుడు డా. పూర్ణచంద్ కూడా తనకు తెలియని నా బాల్యం గురించి, నా సహచరులు మిత్రులు, శ్రేయోభిలాషులు గురించి, అవతార్ మెహెర్‌బాబాతో పెరిగిన సంబంధం గురించి, నా ప్రియతముని సన్నిహితులు, మండలి సభ్యులు తదితర బాబా ప్రేమికులతో నాకు గల సాన్నిహిత్యం గురించి గ్రంధస్తం చేస్తే, మునుముందుకాలంలో బాబా ప్రేమలో ఓలలాడేందుకు తనకు ఎంతో ఉపయోగపడుతుందని కోరాడు. పలు మెహెర్ కేంద్ర కార్యకర్తలు బాబా ప్రేమలో నేనాయన సన్నిధికి ఎలా వచ్చానో తెలుపమని వ్రాయటంతో నాలో ఈ ప్రేరణ మరింత పెరిగింది. ఇప్పటికే పలు సెంటర్లు ప్రచురించిన సావనీర్లలోను, నేను వ్రాసిన కొన్ని రచనలలోను బాబా ప్రేమలోకి నేనెలా వచ్చానో, నా జీవితంలో బాబా అనుగ్రహం నాపై ఎలా ప్రసరించిందో కొన్ని అనుభవాలను ప్రచురించాను. అయినా పూర్తి సంక్షిప్త జీవిత చరిత్ర వ్రాయాలన్న తలంపు ఇంత కాలం నర్మగర్భంగానే మిగిలిపోయింది. అందుకే మా గంగరాజు వారి వంశవృక్షంతో ప్రారంభించి, నా జననము, బాల్యము, విద్యాభ్యాసము, ఆట పాటలు, వృత్తి వైవాహిక జీవితం, కుటుంబ పోషణా బాధ్యతలు, ఉద్యోగ ధర్మం, ఆధ్యాత్మిక చింతన,



ఆచారవ్యవహారాలు స్నేహబృందాలు, సన్నిహిత సహచరులు, సహాధ్యాయులు, సేవా ధర్మాచరణ, మెహెర్ ప్రభువు ధర్శన భాగ్యం బాబాతో సాన్నిహిత్యం విధేయతాపాలన, ఆచరణాత్మక జీవితం, గురుచరణ సన్నిధికి అర్పణవంటి వివరాలను వెల్లడించాలన్న ప్రయత్నంలో ఇది స్వగతము అనే పేరుతో గ్రంధస్తం చేయాలని మా దంపతుల వివాహ స్వర్ణోత్సవ సందర్భంగా పూనుకున్నాను.

గంగరాజువారి వంశవృక్షం :

వంశ ప్రారంభకులు గంగరాజు పెదగంగరాజు. వీరి కుమారుడు పెద్దిరాజు. ముగ్గురు కొడుకుల్లో ఆఖరివాడు అగస్తుడు. ఆయన ఇద్దరుకొడుకుల్లో అచ్చన్న రెండవవాడు. వీర్రాజు అచ్చన్నకు రెండవ కొడుకు. వీర్రాజుకు ఇద్దరే కొడుకులు. మొదటి కొడుకు అప్పయ్య, భార్య నర్సమ్మ. అప్పయ్యకు ఇద్దరు కొడుకులు. వెంకటనరసింహము పెద్దవాడు, భార్య ఆదెమ్మ. వీరికి ముగ్గురు కొడుకులు. రెండవవాడు రామబ్రహ్మం, భార్య కామేశ్వరమ్మ. వీరికి అయిదుగురు కొడుకులు. ఆఖరి కొడుకు వెంకట పూర్ణేశ్వరరావు, భార్య చిన్మయ భ్రమరాంబ. వీరికి ఇద్దరు కుమారులు; ఏడుగురు

కుమార్తెలు. 1934లో చంద్రమౌళీశ్వరరావు, 1936లో వరలక్ష్మీ కామేశ్వరి, 1938లో హైమవతి, 1942లో రూపకుమారి, 1945లో సీతారామమ్మ, 1947లో వెంకట సత్యనారాయణరావు, 1952లో కస్తూరి, 1955లో భారతి, 1959లో రేవతి పుట్టారు. చంద్రమౌళీశ్వరరావు, సత్యప్రసూనలకు, పూర్ణచంద్ 23-4-1957న, 1960లో శ్యామల, 1963లో శ్రీలక్ష్మి పుట్టారు. జి.వి. పూర్ణచంద్‌కు మెహెర్ చేతన 17-8-1984న, మెహెర్ కార్తీక్ 10-2-1987న పుట్టారు.

మా పూర్వీకుల స్వగ్రామం గుంటూరు జిల్లా కొమ్మూరు నాదులుపాడు. ఇది గంగరాజువారి అగ్రహారం. మా తాత గారికిఈ ఊళ్లో వందెకరాల పొలం ఉండేది. మా వంశప్రారంభకులు గంగరాజు పెదగంగరాజు. వీరితరువాత ఏడుతరాలు గడిచిపోగా మా తాతయ్య గంగరాజు వెంకటరామ బ్రహ్మం గారి హయాంలో ఈ ఊరు వదిలిపెట్టి కౌలుదారుల చేతుల్లో పొలాలు వదిలి కొన్నాళ్ళు గుంటూరులోను విజయవాడలోను గడిపారు. మా తాతగారు, నాయనమ్మ వరలక్ష్మీ కామేశ్వరిని వివాహమాడారు. క్రమంగా వీరికి అయిదుగురు కుమారులు కలిగారు. పెద్దకుమారుడు వెంకటసత్యనారాయణరావు 2 వెంకట నరశింహారావు, 3 వేంకట సుబ్బారావు 4, వెంకటకుటుంబరావు, 5, మా నాన్నగారు వెంకట పూర్ణేశ్వరరావు ఇంత మంది ఉన్న కుటుంబాన్ని పోషించేందుకు మా తాతగారు చాలా కాలం, కృష్ణాజిల్లా కంకిపాడు గ్రామంలోని సత్రం నిర్వాహకునిగా ఉద్యోగం చేశారు.

అయిదుగురు కుమారుల ప్రాధమిక విద్యాభ్యాసం ఇక్కడే జరిగింది. పెద్దకుమారుడు ప్రైవేటు ఉద్యోగం చేస్తూ గుంటూరులో స్థిరపడ్డారు. 2వ కుమారుడు వెంకటనరశింహ్వారావు భార్య లక్ష్మినరసమ్మను వివాహము చేసుకున్నారు. రెవెన్యూ శాఖలో ఉద్యోగం సంపాదించి, రెవిన్యూ ఇన్‌స్పెక్టరయ్యారు. విజయవాడలో స్థిరపడి, దోర్నల శేషాద్రి శాస్త్రి వీధిలో స్వగృహము ఏర్పాటు చేసుకున్నారు. వీరి ఏకైక కుమార్తె వరలక్ష్మి కామేశ్వరి (అమ్మడు) ద్రోణంరాజు రాధాకృష్ణమూర్తి బావగారిని వివాహం చేసుకుని 4 కుమారులు, 3 కుమార్తెలతో సుఖసంపదలతో చిరకాలం వర్ధిల్లింది. పెద్దకుమారుడు వేంకట సత్యనారాయణరావు (మా పెదనాన్న గారు) కు ఇరువురు కుమార్తెలు ముగ్గురు కుమారులు. మూడవ పెదనాన్న గారు వెంకటసుబ్బారావు గారు సరస్వతమ్మను వివాహం చేసుకుని, ప్లీడరుగుమాస్తాగా విజయవాడ గవర్నరుపేటలో స్థిరనివాసాన్ని మ్యూజియం రోడ్డులో ఏర్పాటు చేసుకున్నారు. వీరికి సంతానం లేదు. అంత్యదశలో భార్య తమ్ముడు మతుకుమిల్లి సత్యనారాయణగారి కుమారుడ్ని దత్తు చేసుకున్నారు.

నాల్గవ పెదనాన్నగారు వెంకటకుటుంబరావుగారు రాజ్యమ్మ గారిని ద్వితీయ వివాహం చేసుకున్నారు. తొలి వివాహం చేసుకున్న వరలక్ష్మిగారికి ఏకైక కుమార్తెగా



నాగలక్ష్మీ కామేశ్వరి కలిగింది. అనంతరం ద్వితీయ వివాహము చేసుకున్న రాజ్యమ్మ గారివల్ల ముగ్గురు కుమారులు కలిగారు. ఈయన ప్రైవేటు ఉద్యోగం చేసుకుంటూ అరండల్‌పేట మసీదు ఎదురుగా స్వగృహము ఏర్పాటు చేసుకొని 1952 లో మరణించారు. భార్య పిల్లలు ఇక్కడే ఉండిపోయారు.

అయిదవ సంతానమైన మా నాన్నగారు, మా తాతగారు మరణించడంతో మానాయనమ్మగారు అన్నగార్లతో విజయవాడలోనే పెరిగి, విజయవాడ 1 టౌన్‌లోని హిందు హైస్కూల్‌లో ఎస్.ఎస్.ఎల్.సి. పూర్తి చేశారు. వీరి జననం 1900 సంవత్సరం తన 16 వ ఏట ఎస్.ఎస్.ఎల్.సి. పూర్తి చేశారు. తల్లి పోషణకై తదుపరి విద్యను ఆపేసి, ప్రైవేటు ఉద్యోగంలో చేరారు. ఆ తరుణంలో తన అన్నగారైన వెంకట కుటుంబరావు గారి వివాహం కాకుండానే వివాహం చేసుకోవలసిన తప్పనిసరి పరిస్థితి ఎదురైంది. మా నాయనమ్మ వరలక్ష్మి కామేశ్వరి గారి ప్రోద్భలంతో చిన్మయ భ్రమరాంబను వివాహమాడారు.

మా తల్లి చిన్మయ భ్రమరాంబగారు కానూరు చంద్రమౌళీశ్వరరావు, దుర్గాంబలకు ఏకైక కుమార్తె. మా తాత కానూరు చంద్రమౌళీశ్వరరావు గారు సహజంగా మద్దాలి వారి వంశజులు. కోలవెన్ను వాస్తవ్యులైన మద్దాలి శోభనాచలపతిరావుగారు, మా తాత చంద్రమౌళీశ్వరరావుగారు ఏ కోదరులు. మా తాత చంద్రమౌళీశ్వరరావు గారు కంకిపాడు వాస్తవ్యులు కానూరు వీరభద్రరావు గారికి పెంపుడు వెళ్ళారు. అందువల్ల వీరు లింగధారులైన కానురు వారి వంశజులయ్యారు. వీరికి మా అమ్మగారితో పాటు కానూరు మల్లిఖార్జునరావు, జిత మన్మధరావు, మార్కండేయులు అనే ముగ్గురు కుమారులు కలిగారు.

మా అమ్మగారి వివాహం జరిగిన కొద్ది రోజులకే మా నాన్నగారికి కృష్ణాజిల్లా బోర్డులో పాఠశాలఉపాధ్యాయునిగా ఉద్యోగం లభించింది. అప్పట్లో మా అమ్మమ్మ దుర్గమ్మగారు తన ముగ్గురు కుమారులతో కృష్ణాజిల్లా నెప్పల్లి గ్రామంలో ఉండేవారు. అక్కడ మా మేనమామ మల్లి ఖార్జునరావు స్థానిక ఎలిమెంటరీ స్కూలులో ఉపాధ్యాయుడుగా పనిచేసేవారు.

అది 1934వ సంవత్సరం, అప్పట్లో మా నాన్న వెంకట పూర్ణేశ్వరరావుగారు కృష్ణాజిల్లా పొద్దుటూరు గ్రామంలోని ప్రాధమిక పాఠశాలలో ఉపాధ్యాయునిగా పనిచేస్తున్నారు. అణురూపంలో మా నాన్నగారిలో మూడు నెలలు పెరిగిన కణం నా గత జన్మల కర్మ సంపర్కం ఫలితంగా, నా తల్లిగర్భంలో పెరుగుతున్న కణరూపంతో సంయోగం చెంది సమైక్యమై, ఆమె గర్భంలో పెరిగి, పిండరూపంలో తయారై,

నవమాసముల కాలంలో పూర్ణరూపాన్ని సంతరించుకుని 17-10-1934 విజయదశమి సాయంత్రం 6-30 లకు, దేవుడి ఊరేగింపుగా రథం మా అమ్మమ్మగారి ఇంటిముందుకు వచ్చి హారతికై ఆగిన సమయంలో నా తల్లిగర్భం నుండి విడివడి ఈ బాహ్య ప్రపంచంలోనికి నా రూపంతో రావటం జరిగిందని మా పెద్దలు చేప్పేవారు.

ఇలా పొందిన నా రూపానికి మా తల్లిదండ్రులు వేంకట గోపాలకృష్ణ చంద్రమౌళీశ్వరరావు అని నామకరణం చేశారు. నా జన్మనక్షత్రం ధనిష్ఠ 2వ పాదం అయినందున గోపాలకృష్ణ అనే పేరుపెట్టి మా తాతగారు చంద్రమౌళీశ్వరరావు పేరును జోడించారు. గోత్రం లోహితస. ఋషులు విశ్వామిత్ర అష్టక ద్వయా ఋషీయం. ఆపస్తంభ సూత్రం. కృష్ణ యజుర్వేదం.

నా బాల్యం అందరిలాగానే ఆటపాటలతో హుషారుగా సాగిపోయింది. ఎక్కువగా నెప్పల్లిలోని మా మేనమామగారింట్లోనే గడిచింది. విద్యాభ్యాసం కూడా నెప్పల్లిలోని మా మేనమామగారి బోర్డు స్కూలులోనే మొదలైంది. శలవులలో మా పెద్దమామయ్యగారిల్లు కోలవెన్నులో గడిపేవాడిని. మా పెద్ద మేనమామ కోలవెన్నులోని బోర్డు స్కూలులో ఉపాధ్యాయునిగా పనిచేసేవారు. వీరి పిత్రార్జితమైన శోభనాచలస్వామి వారి దేవాలయమునకు ఆయన ధర్మకర్తగా ఉండేవారు. ఇప్పటికీ ఈ దేవాలయం వీరి కుటుంబం ఆధీనంలోనే ఉండి శ్రీ మద్దాలి భోగేశ్వరశర్మబావగారి అజమాయిషీలో కొనసాగుతోంది.

నేను పుట్టింది భావనామ సంవత్సర ఆశ్వీయుజ శుద్ధ దశమి బుధవారము సాయంత్రం 6-30 లకు శే. 6-9-19 తత్కాలిక గ్రహసంపత్తి :

| | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|
| 2 | రవి | - | చిత్త | 3 | 24 | చంద్ర | - | ధనిష్ట |
| 8 | కుజ | - | మఖ | 3 | 25 | బుధ | - | విశాఖ |
| 7 | గురు | - | స్వాతి | 2 | 23 | శుక్ర | - | హస్త |
| 29 | శని | - | ధనిష్ట | 2 | 4 | రాహు | - | శ్రవణం |
| | | | | | | కేతు | - | పుష్య |

| | | | |
|---|---|---|---|
| ⊗ | ⊗ | ల | ⊗ |
| ⊗<br>10 | రాశి<br>వృషభం | | కేతువు |
| ఆరూ<br>చం.<br>శని<br>రా | | | కు 4 |
| ⊗ | 7 | గురు, బుధ,<br>రవి వర్గో | శు |

| | | |
|---|---|---|
| సూర్యోదయాది జననం | - | 30, 25 |
| నక్షత్ర భుక్తి | - | 1, 35 |
| నక్షత్ర శేషం | - | 54, 12 |
| జన్మలగ్నం, వృషభం | - | 5, 2 |
| భుక్తి | - | 2, 20 |
| శేషం | - | 2, 42 |
| అంశలగ్నం | - | వృషభం |
| ఆత్మకారకుడు | - | శని |
| అమాత్య కారకుడు | - | బుధుడు |
| భ్రాతృకారుకుడు | - | చంద్రుడు |
| మాతృకారకుడు | - | శుక్రుడు |
| పుత్ర కారకుడు | - | రాముపు |
| జ్ఞాత కారకుడు | - | కుజుడు |
| కళత్ర కారకుడు | - | గురువు |
| ఆయుంకారకుడు | - | రవి |

అష్టమస్థానం ఆయువు గురించి జననతేది : 12-10-1934

| | | | |
|---|---|---|---|
| కుజశేషం : | 19 | 9 | 6 |
| రాహువు : | - | - | 18 |
| గురువు : | - | - | 16 |
| శని : | - | - | 19 |
| బుధ : | - | - | 17 |
| కేతు : | - | - | 7 |

76 సంవత్సరములపైన ఆయుర్దాయం : - 9 - 2018

**బాల్యం**

ఉద్యోగరీత్యా మా నాన్నగారు కృష్ణాజిల్లాలోని నెప్పల్లి, మైలవరం, నూజివీడు, విజయవాడ తాలూకాలలోని అనేక చోట్ల ఎలిమెంటరీ స్కూళ్లలో ఉపాధ్యాయుడు, ప్రధానోపాధ్యాయుడుగా పని చేశారు. నాకు ఊహవచ్చాక వీటిల్లో బాగా జ్ఞాపకం ఉన్న ఊరు కొండపరవతో మొదలైంది. అప్పట్లో పలకలు, పెన్సిళ్లు, కాగితాలపై వ్రాసుకోవాలంటే సామాన్యులకు సాధ్యమయ్యేది కాదు. అందుకే నేలపై ఇసుకపోసి వేళ్లతో అక్షరాలు దిద్దించేవారు. బాగా వ్రాయటం అలవడిన తర్వాత గాజుపాళీలున్న పుల్ల కలాలతో ఆకు పసరుల సీరాతో పేపరుపై వ్రాయించేవారు. ఈ గాజు పాళీ

కలాలను గద్దముక్కు పాళీ కలాలనేవారు. అక్షరాలు గుణింతాలు, ఎక్కాలు, వారాలు, నెలలు, సంవత్సరాల పేర్లను ఒకరిచేత చెప్పిస్తూ అందరిచేత వల్లెవేయించేవారు. నిత్యం జరిగే ఈ పునశ్చరణ వల్ల అవన్నీ కంఠస్థమయ్యేవి.

కొండపరవ నూజివీడుకు 8 మైళ్ల దూరంలో ఉన్న జమిందారీ గ్రామం. గొట్టిపూళ్లవారు కొండపర్వ జమిందారులు. అప్పటికే నాకు చదువను, వ్రాయను వచ్చుటవల్ల నేను నాన్నగారి స్కూల్లో చదువులో శ్రద్ధ చూపేవాడిని కాను. అందువల్ల, మా నాన్నగారు నన్ను తన మిత్రుడైన గ్రంథాల పెద నరసయ్యగారు, చిన నర్సయ్యగారు అనే వడ్రంగుల వారింట చదివే ఏర్పాటు చేశారు. అప్పటికే నాకు ముగ్గురు చెల్లెళ్లున్నారు. పెద నరసయ్యగారికి పెద అప్పారావు, చిన నరసయ్యగారికి చిన అప్పారావు అనే ఇరువురు కుమారులున్నారు. వారితోపాటు నన్ను కూడా వారింట్లోనే చదివించారు. అప్పారావుల ద్వయం నాకు ప్రాణస్నేహితులయ్యారు. మా నాన్నగారి స్కూలుకు వెళ్లకుండానే అయిదు తరగతులు పూర్తిచేశాను. 1943లో మా నాన్నగారు నన్ను 6వ తరగతి చదివేందుకు హైస్కూలులో చేర్పించే ప్రయత్నం చేశారు. అప్పట్లో నూజివీడులోనే హైస్కూలుండేది. రాజారంగయ్యప్పారావు హైస్కూలు. రోజూ కొండపరవ నుంచి నూజివీడు వచ్చి చదువుకోవాలి, లేదా అందరము నూజివీడుకు మకాం మార్చి అయినా చదువుకోవాలి. ఆర్థిక స్థోమత అంతంత మాత్రంగా వున్న మా నాన్నగారు ఎటూ పాలుపోక, నూజివీడు స్కూలుకు బదిలీ ప్రయత్నం చేసి, ట్రాన్స్‌ఫర్ కోసం జిల్లా బోర్డుకు ధరఖాస్తు చేయగా, నూజివీడుకు కాకుండా 8 మైళ్ల దూరంలోని అయ్యవారిగూడెం (ఇప్పుడది సీతారామపురం అయ్యింది)కు బదిలీ అయింది. ఇదీ రోజూ వెళ్లి వచ్చేందుకు దూరమేనని నాకు బాధకలగకుండా ఉండాలని, నన్ను హైస్కూలులో చేర్పించలేదు. హైస్కూలున్న వూరికి బదిలీ ప్రయత్నం మళ్ళీ మొదలుపెట్టారు.



1945 వచ్చేసరికి 6వ తరగతి, 7వ తరగతి పాఠాలన్నీ ఇంటిలోనే మా నాన్నగారివద్ద చదువుకున్నాను. అదే సంవత్సరంలో మరో చెల్లెలు వరలక్ష్మి సీతారామమ్మ ఈ సీతారామపురంలోనే పుట్టింది. 1946వ సంవత్సరంలో మా నాన్నగారు బదిలీకై చేసిన ప్రయత్నం విజయవంతమై, విజయవాడ తాలూకాలోని కళ్ళంవారిపాలెం అనే వూరికి బదిలీ అయింది. ఈ వూరు కూడా హైస్కూలుకు 3 మైళ్ల దూరంలో వున్న గ్రామమే. నా గ్రహరాత హైస్కూలుకు నడిచివెళ్ళే యోగం ఉన్నట్లున్నది! ఏమైతేనేమి, మా నాన్నగారు మా కుటుంబాన్ని సీతారామపురం నుంచి కళ్ళంవారిపాలెంకు మార్చారు. అప్పట్లో 8వ తరగతిలో తిన్నగా చేరి చదువుకునే

అవకాశం వున్నందున, నన్ను తోట్లవల్లూరు హైస్కూలులో 8 తరగతిలో చేర్చారు. అది అప్పటికి అప్పర్‌ప్రైమరీ స్కూలు మాత్రమే. 8వ తరగతి వరకే ఉండేది. కానీ నేను చేరిన 1947 నుండి ఒక్కో సంవత్సరం ఒక్కో తరగతి పెంచుతూ 1949లో హైస్కూలైంది. 1947లో 8వ తరగతి పాసయ్యాను. అదే సంవత్సరంలో తమ్ముడు వేంకట సత్యనారాయణ రావు పుట్టాడు. 1948లో 9వ తరగతి పాసయ్యాను. విజయవాడ నుండి కృష్ణానదిబారున దివితాలూకా అవనిగడ్డకు సాగునీటి సరఫరాకు కరువు కాలువ ప్రవహిస్తుంది. ఒక వైపున కృష్ణానదికి కరకట్ట ఉన్నది. దీనిని పెద్దకట్ట అనీ, రెండో వైపునున్న కాలవగట్టు చిన్నకట్ట అని పిలిచేవారు. దాని ద్వారా మూడు మైళ్ళు నడిస్తే తోట్లవల్లూరు వచ్చేది.

మా నాన్నగారు స్కూలు టీచరు అవటం వల్ల చదువుకున్న వ్యక్తి కావటం వల్ల ఆ వూర్లోని పిల్లలేకాక, చుట్టుపక్కల వూళ్లనుండి కూడా చాలామంది పిల్లలు వచ్చి ట్యూషన్ చెప్పించుకునేవారు. అంతమంది పిల్లలూ తోట్లవల్లూరు హైస్కూలులోనే చదువుకోవటంతో హైస్కూలు తరగతులలో పిల్లల సంఖ్య అధికమై ఏ ఏటికాయేడు వందమందికి పైగా ఉత్తీర్ణులు కావటంతో తప్పనిసరిగా తదుపరి తరగతిని తెరవవలసి వచ్చేది. జిల్లాబోర్డువారు స్పందించి, సంవత్సరానికొక తరగతిని ప్రారంభిస్తూ 1949కి పూర్తిస్థాయి హైస్కూలుగా అభివృద్ధి చేశారు. అప్పట్లో జిల్లా బోర్డు మెంబరుగా వున్న కళ్లం వెంకటరెడ్డిగారి కృషి ఫలితంగా మా నాన్నగారిని కళ్లం వారిపాలెం నుంచి చాగంటిపాడు స్కూలు ప్రధానోపాధ్యాయునిగా బదిలీ చేశారు. ఆ తర్వాత 1951లో భద్రిరాజుపాలెం స్కూలు ప్రధానోపాధ్యాయునిగా బదిలీ అయి, అక్కడే 1955 సం॥రం లో పదవీ విరమణ చేశారు.

హైస్కూలులోని నా సహాధ్యాయులందరి మధ్య అతిచిన్న పిల్లవాడిగా నేనుండేవాడిని. అయినా ఆటపాటల్లో నేను వారితో కలిసి మెలిసి ఆడుకునేవాడిని. బ్యాట్‌మింటన్ అంటే మహాఇష్టం, శలవులలో చాగంటిపాడులో పిల్లలందరం శివాయలం ఆవరణలో ఆడుకునే వాళ్లం. హైస్కూల్లో మాకు ప్రతిరోజూ సాయంత్రం డ్రిల్లు క్లాసు వుండేది. కవాతు నేర్పేవారు, వ్యాయామం చేయించేవారు. బేస్‌బాల్, ఫుట్‌బాల్, కోకో, బాస్కెట్టుబాల్, చెడుగుడు ఆటలు ఆడించేవారు. అప్పట్లో నేను చాలా బక్కపలచగా ఉండేవాడిని. ఆటలతో తేలికగా అలసిపోయేవాడిని. అయినా డ్రిల్లుక్లాసుల్లో బేస్కెట్టు బాల్, బేస్‌బాల్ ఆటల్లో పాల్లొనే వాడిని. జాస్తి హరినారాయణ, గుత్తా శ్రీమన్నారాయణలు గ్రిక్ పోటీల్లో ఫస్టు వచ్చేవారు, వీరు నాకు ఆత్మీయులైన క్లాస్‌మేట్సు.

అప్పట్లో 8వ తరగతిని తర్డ్‌ఫారము అని, 9వ తరగతిని ఫోర్తుఫారం అని, 10వ తరగతిని ఫిఫ్తఫారం అని పిలిచేవారు. తరువాతది సిక్స్తు ఫారం, దీనినే ఎస్.ఎస్.ఎల్.సి. అనేవారు. నేను తర్డు, ఫిఫ్తుఫారాలు మొదటి తరగతిలో

ఉత్తీర్ణుడనయ్యాను.. సిక్తు ్రఫారం 1950లో పరీక్షల మధ్యలో ఆటలమ్మపోసి తీవ్ర అస్వస్థతకు గురికావటం వల్ల, మార్చి పరీక్షల్లో ఫెయిల్ అయ్యాను. అందువల్ల 1951లో మళ్లీ హైస్కూల్లో చేరి చదివి పాసయ్యాను. ఆ తరువాత, నా చదువు విజయవాడ ఎస్.ఆర్.ఆర్. & సి.వి.ఆర్. కాలేజికి మారింది. విజయవాడలో మా మేనమామ కానూరు జితమన్మథరావు, టింబరు డిపో మేనేజరుగా పనిచేసేవారు. ఈయనకే 1952లో మా పెద్ద చెల్లలు వరలక్ష్మి కామేశ్వరిని ఇచ్చి మా నాన్నగారు పెళ్లిచేశారు. వీరింటి వద్ద ఉండి, ఇంటర్మీడియట్ చదివాను. అమ్మమ్మ గారింట్లో భోజనం చేసి, నకరికంటి నరశింహం, బాపనయ్యగార్ల టింబరు డిపోలో పడుకుని చదువుకున్నాను.

1953లో మా రెండవ చెల్లెలు హైమవతికి, కనుపర్తి సత్యనారాయణరావు బావగారితో వైభవంగా వివాహం జరిగింది. ఇంటర్మీడియట్ తరగతిలో నేను మొదట్లో బై.పి.సి. గ్రూపులో చేరినా ఆర్టుకు మారాను. అప్పట్లో ఎస్.ఆర్.ఆర్. & సి.వి.ఆర్. కాలేజి ప్రైవేటు కాలేజి. విజయవాడలో ఈ కాలేజీ ఒక్కటే వుండేది. చక్కని లైబ్రరీ అవకాశాలుండేవి. ముదుంబై రాఘవాచార్యులుగారు దీనికి ప్రిన్సిపాలు, జొన్నలగడ్డ సత్యనారాయణమూర్తిగారు ఇంగ్లీషుకు హెడ్ ఆఫ్ ది డిపార్టుమెంట్‌గా ఉండేవారు. హేస్కాట్ ఇంగ్లీషు లెక్చరర్, డి.వి. కృష్ణయ్యగారు కామర్సుకు హెడ్ ఆఫ్ ది డిపార్టుమెంటు.

క్లాస్ ప్యూపిల్సు లీడరుగా రెండేళ్లు స్నేహితులతో చురుకుగా పనిచేశాను. మా లెక్చరర్లు శ్రీ విశ్వనాధ సత్యనారాయణ గారికి, శ్రీ జొన్నలగడ్డ సత్యనారాయణమూర్తిగారికి



చాలా సన్నిహితంగా మసిలేవాడిని. ఇద్దరూ నేనంటే అభిమానం చూపేవారు. శ్రీ డి.వి. కృష్ణయ్యగారు నా చదువులో ప్రత్యేక శ్రద్ధ చూపేవారు. పాటిబండ్ల మాధవరాయశర్మగారు క్లాసులో నాపై ప్రత్యేక శ్రద్ధ చూపేవారు.

ఆ రోజులలో మా కాలేజీ ఆర్.ఎస్.ఎస్. నాయకుల ఆధ్వర్యంలో నడిచే ప్రైవేటు కాలేజి అయినందున అక్కడి విద్యార్థులంతా అధిక సంఖ్యలో ఆర్.ఎస్.ఎస్. వాలంటీర్లే ఉండేవారు. విద్యార్థి సంఘం కూడా వారిదే. అయితే ఎస్.ఎఫ్.ఐ. విభాగం కూడా ఉండేది. దానితోపాటు స్టూడెంటు కాంగ్రెస్ విభాగం కూడా మా రోజుల్లోనే స్థాపించుకున్నాము. నేను స్టూడెంటు కాంగ్రెస్ ప్రశిడెంటునయ్యాను. ఎస్.ఎఫ్.ఐ. నాయకుడు శ్రీ గొంది వెంకటేశ్వరరావు, నాకంటే ఒక సంవత్సరం ముందుండేవాడు. నేను కాలేజీలో చేరిన ముందు సంవత్సరము మా బావగారు మన్నవ సీతారామారావుగారు ఈ కాలేజీలోనే బి.ఎ. పాసయ్యారు. ఆయనకు, మా పెదనాన్న వేంకట కుటుంబరావుగారి తొలి భార్య సంతానం నాగలక్ష్మి కామేశ్వరితో వివాహం జరిగింది.

ఈయన మా పెదనాన్నగారికిబావమరిది, తొలి భార్యకు తమ్ముడు. వీరి కుమారుడు కుమారరఘు వరప్రసాద్ ఎం.కాం. కు, నా రెండవకుమార్తె శ్రీలక్ష్మి, బి.ఎ. ని ఇచ్చి వివాహం చేశాము. ఈ వివరాలు ముందు వస్తాయి. నాతోపాటు ఇంటర్ చదివిన వారనేకులు ఐ.ఎ.ఎస్., ఐ.పి.ఎస్., ఇంజనీర్లు, ప్రముఖ డాక్టర్లు అయ్యారు. కానీ నేను మాత్రం నా అదృష్టమో, దురదృష్టమో కాని 1953లో ఇంటర్ ఫైనల్ పరీక్షల్లో మొదటి రోజు ఇంగ్లీషు మొదటి పేపరు పరీక్ష ఉదయం 8-00 లకు కాగా టైము అవగాహన లేక 10-00 లకు అనుకొని ఆలశ్యంగా రావటం వల్ల, మిగతా అన్ని పరీక్షలు బ్రహ్మాండంగా వ్రాసి అధిక మార్కులు తెచ్చుకున్నప్పటికీ ఒక పరీక్ష వ్రాయలేదు కనుక తప్పాను.

1947లో నాకు ఉపనయనం శాస్త్రోక్తంగా మా తల్లిదండ్రులు నిర్వహించారు. అప్పటి నుండి సంధ్యావందనంతో పాటు నిత్యానుష్ఠానం విడవకుండా చేసుకునే అలవాటైంది. 1954 మార్చి పరీక్షల్లో ఇంటర్ తప్పటంతో విజయవాడ నుండి చాగంటిపాడుకు మా ఇంటికి తిరిగి వచ్చేశాను. అక్టోబరు పరీక్షలకు చదివి తప్పిన ఇంగ్లీషు పేపరు వ్రాశాను. ఖాళీగా ఇంటి వద్ద ఉండటంవల్ల, చాగంటిపాడులోని చెన్నకేశవస్వామి ఆలయం లైబ్రరీలో లైబ్రేరియన్‌గా పనిచేశాను. ఆ సమయంలో నాకు సాహిత్యంపై ఎనలేని అవగాహన ఏర్పడింది. లైబ్రరీలో కూర్చున్నంత సేపు ఏవో పుస్తకాలు చదివే వాడిని, భారత భాగవతాలు, వేదములు, గీత వ్యాఖ్యానాలు, యోగవాశిష్టము వంటి ఉద్గ్రంథాలు చదువుటయే కాక వాటిపై ఆడిదం రామారావు, రాధాకృష్ణమూర్తి, జె. వెంకటరెడ్డి, బద్దిగం సాంబిరెడ్డి, బసివిరెడ్డి తదితరులతో చర్చించుకోవటం వల్ల ఆధ్యాత్మిక చింతన అలవడింది. అనేకమంది ప్రసిద్ధ కవుల వైవిధ్యంగల రచనలు చదువుట వల్ల సాహిత్యాభిలాష అబ్బింది.

సనాతన ధర్మాల్ని ఆచరించే ఆచారవంతమైన కుటుంబం మాది. నేను నిష్టగా శిష్టాచారంతో నిత్యానుష్టానం చేసేవాడిని. మాది మధ్యతరగతి కుటుంబం కావటంతో, ఆర్థిక ఇబ్బందులు ఎప్పుడూ వెన్నాడుతూ ఉండేవి. అయినప్పటికి చాలీచాలని జీతంతో మా నాన్నగారు ఇంతపెద్ద కుటుంబాన్ని సహనంతో ఓర్పుగా, ఇది కావాలి, అది కావాలని మమ్మల్నెవరినీ అడుగనీయకుండా, సమయానికి అన్ని అవసరాలను సమకూర్చగలిగారంటే అది ప్రియతమ దైవం మాకు అందించిన అద్భుత వరమని నాభావన. శ్రమతో చెమటోడ్చి ట్యూషన్లు చెప్పి, గ్రామస్థుల మధ్య మంచిని పెంచుకుంటూ ఎందరో పిల్లల్ని విద్యలో తీర్చిదిద్దారు. ఆయన వద్ద చదువుకున్న వారిలో ఇంజనీర్లు, డాక్టర్లు, ప్రభుత్వాదికారులుగా చాలామంది ఉన్నత స్థానాలను అలంకరించారు. చాగంటిపాటి వెంకటేశ్వరరావు, కళ్లం వెంకటరెడ్డి అనే వారికి ప్రైవేటుగా ఎం.ఎ. కి ట్యూషను చెప్పి ప్యాసు చేయటంలో చరితార్థులయ్యారు.

1953లో మా మేనమామ మరియు మా బావగారైన కానూరు జిత మన్మధరావుగారు పనిచేస్తున్న టింబరు డిపో ఎత్తి వేయటం వల్ల మద్రాసులో కొత్తగా దాని యజమానులైన కపిలవాయి పూర్ణచంద్రరావు, బాపనయ్యగారి సోదరులు టింబరు డిపో ప్రారంభించి, మా మేనమామను కూడా అక్కడకు తీసుకు వెళ్లటంతో వారు మా అమ్మమ్మ దుర్గాంబగారిని చాగంటిపాడులో మా ఇంటి వద్ద మా అమ్మగారి పోషణలో ఉంచారు. నా కాలేజీ చదువుకు స్వస్థి చెప్పి నేను ఇంటి వద్దనే ఉండిపోయాను. టీచర్సు ట్రైనింగు చదివించాలని మా నాన్నగారు బందరు వెళ్ళి ప్రయత్నాలు ప్రారంభించారు.

నేనంటే మా అమ్మమ్మగారికి ప్రాణం. నన్ను చిన్నప్పటి నుండి ఎంతో గారాబంగా పెంచింది. నా పేరు మా తాతగారి పేరవటంతో, నన్ను చంద్రమౌళీశ్వరరావు అని పిలిచేదికాదు. ఎవరన్నా మా స్నేహితులు వచ్చి చంద్రమౌళి ఉన్నాడా? అనడిగితే మా అమ్మమ్మ చిన్నపిల్లలా సిగ్గుపడి మెలికలు తిరిగిపోయేది. అందుకే ఆమె నన్ను "కృష్ణుడు" అని నిలిచేది. మా ఇంట్లో వారందరూ మా అమ్మ, నాన్నగారలు, మా మేనమామలు కూడా "కృష్ణుడ"నే పిలిచేవారు. అలా మా బంధువులందరి మధ్య నేను కృష్ణుడుగానే మిగిలాను. అయితే స్కూలులో, హైస్కూలులో, కాలేజీలో, అందరిలో మాత్రము నేను చంద్రమౌళీగానే పిలవబడ్డాను.



నాకు అప్పటికి 20 ఏళ్లు వయస్సు రావటంతో మా అమ్మమ్మ నా పెళ్ళి చూడాలన్న ఆకాంక్ష తెలిపింది. సంబంధం చూడమని మా అమ్మానాన్నగార్లపై వత్తిడి తేసాగింది. క్రమంగా ఆమె ఆరోగ్యం క్షీణించసాగింది. ఫలితంగా "కృష్ణుడు పెళ్లి నేను కళ్లారా చూడాలన్న" ఆమె వత్తిడి తీవ్రమైంది. ఆమె పోరుపడలేక మా నాన్నగారు తన సహోధ్యాయులు, తన మిత్రులు దృష్టికి తెచ్చి ఏదైనా సంబంధం ఉంటే చెప్పమని కోరారు. తోట్లవల్లూరు హైస్కూలులో చదువుకునేటప్పుడు, నేను మా నాన్నగారి మిత్రుడైన బొడ్డపాటి కుటుంబరావుగారనే ఉపాధ్యాయుని ఇంట్లో క్యారేజి పెట్టుకుని భోజనం చేసేవాడిని. ఈయన వద్ద నా వివాహ విషయాన్ని మా నాన్నగారు ప్రస్తావించటంతో కంకిపాడులో టీచరుగా పనిచేస్తున్న శ్రీ దావులూరు వెంకటేశ్వరరావుగారి రెండవ అమ్మాయి సత్య ప్రసూన ఉన్నదని చెప్పి, మా నాన్నగారివద్దకు వధువు తండ్రిని పంపారు. శ్రీ వెంకటేశ్వరరావు, పిచ్చయ్య మాష్టరుగారువచ్చి మా తల్లిదండ్రులతో మాట్లాడటం, వారింటికి వచ్చి పిల్లను చూచుకోమని కోరటం, అలాగే మేము వెళ్లి పిల్లను చూచి రావటం, ఆ వెనువెంటనే పరస్పర అంగీకారం కుదరటం అన్నీ జరిగిపోయాయి. చూచిన ఒకే సంబంధము,

వెనువెంటనే అది ఖాయమవటం విశేషం.

అలా నా వివాహం, సత్యప్రసూనతో 1953 సంవత్సరం, కార్తీకశుద్ధ దశమినాడు కంకిపాడు లోని మా అత్తవారింటియందు వైభవంగా జరిగింది. నా భార్య శ్రీమతిసత్యప్రసూన 6-7-1935 యువనామ సంవత్సర ఆషాఢశుద్ధ పంచమి శనివారంనాడు కంకిపాడులో జన్మించింది. తండ్రి దావులూరు వెంకటేశ్వరరావు, తల్లి దావులూరు శీతారామమ్మ వారికి ఇరువురు కొడుకులు, ఇరువురు కుమార్తెలు పెద్దకుమారుడు దావులూరు వెంకట కుటుంబసుబ్బరాయశర్మ, ఇతని తర్వాత రాజేశ్వరి, సత్యప్రసూన అను కుమార్తెలు, ఆఖరివాడు దావులూరు రాధాకృష్ణప్రసాద్. వీరిది భారధ్వాజస గోత్రం. నాభార్య సత్యప్రసూనది సింహరాశి.



మానాన్నగారి కృషి నాకు టీచరు ట్రైనింగుసీటు తేవటంలో ఫలించలేదు. నేను ఖాళీగా ఉండిపోయి ఎంప్లాయిమెంటు ఎక్స్చేంజి చుట్టూ ప్రదక్షిణాలు ప్రారంభించాను. మిత్రుల ప్రోత్సాహంతో ప్రభుత్వకార్యాలయాల చుట్టూ తిరుగసాగాను. ఒక వంక బాహ్యంగా పొట్టతిప్పలు కోసం సంపాదనా తాపత్రయంలో మునిగిపోయాను. మరో వంక మా నాన్నగారికి పదవీ విరమణ సమయం దగ్గర పడుతోంది. అయినా దైవచింతనలో ఎటువంటి లోపమురానీయకుండా సాధనలను చేసేవాడను. ఆధ్యాత్మిక మార్గంలో సిద్ధాంతాల కంటే, ఆచరణయోగ్యమైన జీవితానికే ఎక్కువ ప్రాధాన్యత ఉన్నదన్న విషయం నాలో బాగా పాతుకొని వున్నందున, నా చింతన ఆచారవ్యవహారాలు. పూజావిధానాలపై పనిచేసేది. చదువుకునే రోజులలో ప్రతిసంవత్సరం, పరీక్షా ఫలితాలు రాగానే, పాసైన సందర్భంగా సత్యనారాయణ వ్రతం చేసుకోవటం మా సన్నిహితస్నేహితులను పిలిచి పార్టీ చేసుకోటం నాకు అలవాటు ఇది సదాచారసాంప్రదాయమైనప్పటికీ, ఏకాగ్రతతో నేను వ్రతకల్పం స్వయంగా చదువుకుంటూ చేసుకునే వాడినేకాని, మూఢాచారంగా చేసుకునేవాడిని కాను. భక్తితో చేసేపూజలు ఆధ్యాత్మికంగాను, భౌతికంగా కూడా ఉపయోగపడుతాయన్న విశ్వాసం నాలో ఆ లేత వయసులోనే పాదుకున్నది.

అప్పట్లో అవతార్ మెహెర్‌బాబా ఆంధ్రప్రదేశ్‌లో ప్రజాదర్శనలిచ్చేందుకు కార్యక్రమాలు జరుగుతున్నట్లు ప్రకటనలొచ్చాయి. అయితే యీ మెహెర్‌బాబా ఎవరో నాకు తెలియదు. ఆయన గురించి నేనంతవరకు విని కూడా ఉండలేదు. ఆయనకు స్వాగతం చెప్పేందుకు మెహెర్ రిసెప్షన్ కమిటీ వారు ఏర్పాట్లు చేస్తున్నట్లు వార్తలువచ్చాయి. అయితే, విజయవాడలో ఎటువంటి కార్యక్రమం లేకపోయినప్పటికీ,

1953 జనవరి 16కు విజయవాడ రైల్వేస్టేషను జి.టి.రైలులో వచ్చారని పేపర్లో చదివినా, ఆయన గురించి అంతకుముందు నా కేమి తెలియకపోవటం వల్ల, నేను అంతగా పట్టించుకోలేదు. ఆకర్షితుడ్ని కాలేదు. అందుకే ఈ విషయాన్ని అప్పుడే మరచిపోయాను.

నాకు కాంగ్రెస్ కార్యకర్తగా అనుభవమున్నది. సేవాదళ్ వాలంటీర్‌గా1947 ఆరంభం నుంచి పనిచేశాను. తోట్లవల్లూరులో శ్రీ గుత్తాసత్యనారాయణ గారు అనే జిల్లా కాంగ్రెస్ నాయకుడుండేవారు. ఆయన నాయకత్వంలో సేవాదళవాలంటీర్లుండేవారు. అందులో నేనూ ఒకడిని. ఈ వాలంటీర్లను ఊరూరా తిరిగిపరాయి పాలకులను ఇండియా వదలి పొమ్మని ప్రచారం చేసేందుకు స్కూళ్ళ శలవురోజుల్లో తిప్పేవారు. తలొకసైకిలు ఇచ్చి టోపీ, చొక్కా, లాగు (ఖద్దరువి) ఒక రూళ్ళకర్ర (సన్నది) ఇచ్చే వారు. స్వాతంత్ర్యం ప్రకటించబోయేముందు 1947 జనవరిలో మా వాలంటీర్ల బృందం, తోట్లవల్లూరు నుండి బయలు దేరి సైకిళ్ళపై భద్రిరాజుపాలెం, చాగంటిపాడు పెనమకూరు మీదుగా ఉయ్యూరు, మంటాడలలో ఊరేగింపు జరిపి, కపిళేశ్వరపురంలో భోజనాలకు విడిది చేశాం. ఆ సమయంలో పోలీసులు వచ్చి మమ్మల్నందరిని అరెస్టు చేసి, లారీపై ఉయ్యూరు తీసుకువెళ్ళి ఆ రాత్రంతా పోలీసు స్టేషనులో బంధించారు. మర్నాడు ఉదయం శ్రీగుత్తాసత్యనారాయణ గారు తదితరనాయకులు వచ్చిమమ్మల్ని విడిపించారు. ఈ సంఘటన నన్ను కాంగ్రెస్ అభిమానిగా ఉండి పోయేట్లు చేసింది.

నా వివాహమునకు కొద్దిరోజుల ముందే మా అమ్మమ్మ దుర్గమ్మ గారు మరణించారు. 1955 జనవరిలో మా నాన్నగారి పదవీ విరమణ జరుగనున్నందున నన్ను నా భార్యతో విజయవాడ పంపాలని, విడిగా కాపురం పెట్టిస్తే స్వయంగా అక్కడ ఉండి ఏదైనా ఉద్యోగం సంపాదించుకొనే వీలుంటుందని ఆలోచిస్తున్న సమయంలో 1954 ఫిబ్రవరిలో అవతార్ మెహెర్‌బాబా మరల ఆంధ్రాపర్యటనకు వస్తున్నారని పేపర్లలో ప్రచారంచేయటం జరిగింది. ఈ రెండవ పర్యటనలో ఫిబ్రవరి 21న విజయవాడలో ఇప్పుడున్న క్షేత్రయ్య కళాక్షేత్రం ప్రాంతంలో మూడు కాలువలు చీలుతున్న ముక్కోణాకారస్థలం ఖాళీగా ఉండేది. ఆస్థలమంతా విశాలమైన పందిళ్లువేసి దానిక్రింద ఆయన దర్శనకార్యక్రమం ఏర్పాటు చేశారు. స్థానిక మెహెర్‌బాబా కార్యకర్తలు, ఊరంతా గోడలపై వీధి వీధిలో మెహెర్ బాబా ఆహ్వాన పత్రికలు అంటించి, ఆయన దర్శన కార్యక్రమంగురించి విపుల ప్రచారం చేశారు.

ఒక మానవుడు తాను అవతారపురుషుడనని ప్రకటించుకొనుటను విశ్వసించని కొందరు ఆయన కార్యక్రమాన్ని అభాసుపాలుచేయాలని దర్శన సమయానికి, సభాస్థలికి చేరుకున్నారు. ముందుగానే వీరిపన్నాగాన్ని పశిగట్టిన, మా కాలేజి కాంగ్రెస్ సేవాదళవాలంటీర్లు నాతో ఉన్నసాహచర్యం వల్ల నన్ను పిలిపించి, వారి ప్రయత్నాన్ని అడ్డుకోవాలని ప్రేరేపించారు. ఆయన్ని చూడాలన్న ఆకాంక్షతో కాకుండా, ఎవరైన

ఆటంకపరిచి అల్లరిచేస్తే ఎదుర్కొనుటకు మేమంతా సమాయత్తమై సభాస్థలికి చేరుకున్నాము. ఆరోజు ఉదయం మెహెర్‌బాబా గుంటూరు వెళ్లారని, సాయంత్రం 4-00 గంటలకు దర్శనమిచ్చేందుకు సభాస్థలికి చేరుకుంటారని మైకుల్లో ప్రకటించారు. సాయంత్రం 6-00 లు అయినా ఆయన రాకపోయేసరికి ఇండియన్ పంక్చువాలిటీని పాటించే ఈయనేం దేవుడంటూ వారంతా వెళ్ళిపోయారు.

అయినా మళ్లీ వాళ్లంతా తిరిగివస్తారేమోనని, మేము మాత్రం, వాలంటీర్ల డ్రస్సులో లక్షమందికి పైగా కూర్చున్న జనం మధ్య నిలబడే ఉన్నాం. ఆరుగంటలనంతరం మెహెర్‌బాబా వచ్చి వేదిక పైకి ఎక్కిచుట్టూతిరుగుతూ అందరికీ నమస్కరించారు. విజయవాడ మెహెర్ ప్రేమికులు చేసిన ప్రచారంలో మెహెర్‌బాబా అందించే సందేశంవిని, స్వహస్తాలతో ఇచ్చే ప్రసాదాన్ని స్వీకరించి తరించండని చెప్పటంవల్ల అంత మంది ఆయన ఏం చెపుతారోనని వినేందుకు నిశ్శబ్ధంపాటించారు. అయితే బాబా ఏం చెప్పకుండా నమస్కరించి ముందుగా ప్రసాదం ఇస్తాను ఆడవారు వచ్చి తీసుకోమని సంజ్ఞలు చేసిన మాటల్ని మైకులో చెప్పడంతో ఆడవాళ్ళ వైపు నుంచి తోపులాట జరిగింది. గందరగోళాన్ని సర్దుబాటు చేసేందు కార్యకర్తలు, వాలంటీర్లు సాయశక్తులా కృషి చేశారు వారితో పాటు మా సేవాదళ కార్యకర్తలు కూడా తోపులాటను తప్పించే ప్రయత్నం చేశాము. అలా నేనూ జనాన్ని సర్దుతూ బాబా కూర్చున్న వేదిక వద్దకు చేరుకున్నాను. ఈ లోపుగా, స్త్రీల వైపునుండి ఆపి ప్రసాదాన్ని పురుషులకు పంచటం ప్రారంభించారు. బాబా ప్రక్కనున్న బుట్టలో ఉంచిన అరటిపండ్లు అయిపోసాగాయి. అదిగమనించిన పురుషులు సైతం, ఆయన చేతుల మీదుగా అరటిపళ్ళు ప్రసాదంగా తీసుకోవాలన్న ఉద్దేశ్యంతో తోపులాటకుదిగారు. ఒకలారీ నిండా అరటిపండ్లున్నాయి. అందరికీ అందుబాటవుతాయి. తోసుకోవద్దని మైకుల్లో అరుస్తున్నా జనం ఆగలేదు.

దానితో మెహెర్‌బాబా తానుపళ్ళను తాకానని, వాటిని నా ప్రసాదంగా కార్యకర్తలు అందరికీ పంచుతారని ప్రకటించి వేదిక దిగబోతుండగా, ఆ పక్కనే ఉన్న నేను బాబా మైపు చేతులుదోసిలి పట్టటం, వెంటనే ఆయన నా చేతులలో ఒక అరటిపండు ఉంచి, పూర్తిగా తినమని సంజ్ఞలు చేశారు. అప్పట్లో ఆయన మౌనం పాటిస్తున్న విషయంనాకు తెలియదు. ఆ అమృతమూర్తి స్పర్శభాగ్యం పొందిన ఆ అరటిపండును తొక్కతో సహా కళ్ళకద్దుకొని పూర్తిగా తినేశాను. అలా బాబా తొలి దర్శనభాగ్యం నాకు దొరికింది. ఆ తర్వాత, ఆయన మనుషులు (మండలివారు) చేతులతో దండకట్టి సురక్షితంగా మెహెర్‌బాబాను రోడ్డుపైకి చేర్చి, ఆయన్ని కారులో ఎక్కించుకొని, తాము బసచేసిన మాజేటి రామమోహనరావు గారింటికి తీసుకు వెళ్ళిపోయారు. తోపులాట మధ్య జనమందరికి ప్రసాదాన్ని సక్రమంగా పంచిపెట్టారు. మేముకూడా తిరిగి

వెళ్ళిపోయాం. ఇలా నా తొలి దర్శన భాగ్యంతో నేను అవతారుని స్పర్శభాగ్యాన్ని, ఆయన ఇచ్చిన అరటిపండు ప్రసాదం ద్వారా పొందగలిగాను.

అయితే దేహాభిమానంలో మమైక్యమన నేను కొత్తగా పెళ్లైనందున, వ్యక్తిగత దేహాభిమానంతో పాటు, సంసారబంధము పెనవేసుకున్నది. నా భార్య కాపురానికి రావటం వల్ల, కోరిక బలపడి, మనస్సు విషయానుభవాలకు తాపత్రయపడసాగింది. అన్నము జడము, ఆ అన్నాన్నితినే యీ శరీరము కూడా జడమేనన్న విషయము, మనస్సులో కనుమరుగైంది. వ్యష్టి అనే అభిమానాన్ని చంపుకొని, సమిష్టితో ఐక్యంపొందాలన్న విచక్షణ కోల్పోయాను. ఈ శరీరంనాది. కాని నేను శరీరంకాను అనే సత్యాన్ని అనుభవించే అదృష్టం, మెహెర్‌దేవుని స్పర్శదర్శన, ప్రసాదము ద్వారా పూర్వజన్మలసుకృతఫలితంగా లభించినా, కర్మబంధాలు, నన్ను బంధీనిగా చేశాయి.

“ఖుద్ మిటేగా తో ఖుదామిలేగా” కానీ నాలో అటువంటి ఏకాగ్రతకుదరలేదు. భార్యా వ్యామోహంలోపడి సంసారలంపటంలో కూరుకుపోయాను. గురువుపై మనస్సు నిల్పలేకపోయాను. అయినా ధర్మాచరణను విడువకుండా సాగించాను. శరీర జ్ఞానమును అవగతంచేసుకోవాలన్న పిపాస ఉండేది. సాధకుడిగా ఆధ్యాత్మిక సమావేశాలకు హాజరయ్యేవాడిని, చిన్మయానంద స్వామి ఉపన్యాసాలు ఆరోజుల్లో ఇప్పుడున్న స్వర్ణప్యాలెస్ ప్రాంగణంలో చల్లపల్లి బంగళాలో జరిగేవి. అది సువిశాలమైన ఖాళీ జాగా ఉన్నప్రదేశం కావటంతో ఈ సభలు అక్కడే జరిగేవి. ప్రతిసంవత్సరం విడువకుండా నేను హాజరయ్యేవాడిని. సత్యనారాయణపురం, రైల్వేస్టేషనుదగ్గర సీతారమ కళ్యాణ మండప ప్రాంగణంలో రోజూ పండితులు పురాణం చెప్పేవారు. మా పెదనాన్న సుబ్బారావు గారు, మా పెద్దమ్మగార్లతో పాటు అప్పుడప్పుడూ పురాణానికి వెళ్ళినోట్సువ్రాసుకునే వాడిని. భూదానోద్యమనాయకుడు వినోభాభావే విజయవాడకు 1954లో వచ్చారు. అప్పట్లో మేము చాగంటిపాడులోనే ఉన్నాము. 1947 లో నాకు ఉపనయనం జరిగింది. అప్పుడు నా వయస్సు 14 ఏళ్ళు శాస్త్రోక్తంగా నాకు ఉపనయనం జరిగింది.

ఈ మాయ యొక్క అనేకత్వం బ్రహ్మాండము దాని బంధాలనుండి ఆత్మవిమోచన కలగాలంటే, అవతారుని కృప తప్పనిసరి. ఆయన సహాయంలేకపోతే దానిని సాధించలేము. ప్రాపంచికమానవ మనస్సు ప్రాపంచిక సుఖభోగాలకై వెంపర్లాడుతుంది. నాకు భక్తి భావం అలవడిందేకాని, శ్రద్ధ కుదరలేదు. ఇది అలవడితేనే కాని అసలైన ప్రేమ జనించదు. ఈ నిజమైన ప్రేమను సాధించాలంటే, అంకిత భావం కుధరాలి. ఇది కుదిరితేనే ప్రతిఫలాపేక్షలేని నిరాడంబరమైన నిర్మలజీవితం అలవడుతుంది. ఇటువంటి నిర్మల జీవితాన్ని నిరంతరదైవసేవలో ప్రియతముని పాదచరణ సన్నిధిన శరణాగతియై ఆయనకు అంకితం కాగలిగితే జన్మధన్యమౌతుంది. అయితే ఫలాపేక్షతో కర్మాచరణ చేయటం మాత్రమే అలవడిననేను దైవభక్తిలో శ్రద్దనుపెంచుకోసాగాను

తప్ప, వినయవిధేయతలతో కూడిన ఏకాగ్రప్రేమ నాకు అలవడలేదు. అందువల్ల శాస్త్రపఠనం ద్వారా, శబ్దజ్ఞానాన్ని పెంచుకోసాగాను. అనుకోని సంఘటన జరిగి, సాక్షాత్తు గురుదేవుడు తానై దొరికి, తన చేతినందించినా, మానవ మనస్సు నన్ను తిరోగాముడ్ని చేసి, ఆయన స్వయంగా అందించిన పవిత్రకొంగు బంగరు భాగ్యాన్ని పట్టుకొనే అదృష్టాన్ని జారవిడుచుకొనేట్లు చేసింది. నా ఆత్మ జ్యోతి మరింత మసిబారిపోయింది.

భౌతిక లంపటంలో ఇరుక్కుపోయాను. ఏదో ఒకవుద్యోగంలో చేర్చాలన్న తపనలో మానాన్నగారు, నన్ను క్రొత్తగా కాపురానికి వచ్చిన నా భార్యతో విజయవాడలో ఇల్లు అద్దెకు తీసుకొని కొత్త కాపురం పెట్టించారు. అదే సమయంలో నాకు తెలియకుండానే కాలక్షేపం కోసమా అన్నట్టు సద్గ్రంథపఠనం చేసినా సత్ప్రవచన శ్రవణం విన్నా సత్సాంగత్యం అలవడలేదేమోమరి! పూర్తిగా భవబంధాల వలలో చిక్కుకుపోయాను.

అంతలో మా నాన్నగారు ఉద్యోగ విరమణ చేయటం జరిగింది చాగంటిపాడు నుండి మకాం విజయవాడకు మార్చి కాపురం పెట్టారు. ఈ విధంగా పైసా ఆదాయంలేకుండా ఇంతమందితో అద్దె ఇంట్లో గడపాల్సివచ్చింది. చదువుకున్న నిరుద్యోగిగా మిగిలిన నాతో పాటు మరో జీవిని కూడ మా నాన్నగారిమీద భారం మోపడం నాకు బాధ అనిపించింది. ఉద్యోగం కోసం నేను మానవ ప్రయత్నం చేశానేగాని నిర్దేశించేది భగవంతుడు గదా! “ ఆయన కృప గలిగితేనే బ్రతుకుతెరువుకు మార్గం దొరుకుతుందన్న నమ్మకంతో రోజులు దొర్లించాను.

నా భార్యది సర్దుకుపోయేగుణమే అయినా కొత్త మనుషులమధ్య ఎలా మెలగాలో ఇంకా అవగహన కుదరని పరిస్థితి. ఉద్యోగం సంపాదించుకోలేని నా అసమర్ధతపై మా అమ్మ మానసికంగా తల్లడిల్లింది. 1955లో ఒక రోజున కంకిపాడులో కానూరు సుబ్బారావు గారింట్లో జరిగిన పెళ్ళికి ఆయన సోదరుడు డా॥ కె.యల్.రావుగారు వచ్చారు. ఆయన మా మామగారికి బంధువైనందున ఆయన్ని కలసి నా ఉద్యోగం గురించి ప్రస్తావించారు. ఆరోజుల్లో ఆయన సెంట్రల్ వాటర్ & పవర్ కమీషన్ ఛైర్మన్‌గా ఉండేవారు. ఆ తరువాత ఆ శాఖకు మంత్రిగా కూడా పనిచేశారు.

డా॥ కె.ఎల్.రావుగారు తన అన్న సుబ్బారావు గారి అబ్బాయి కానూరి కుటుంబరావు, ఎగ్జిక్యూటివ్ ఇంజనీరు గారితో తన అధికారపరిధిలో నాకు యేదో ఒక ఉద్యోగము కల్పించమని చెప్పారు. మర్నాడే కుటుంబరావు గారు నన్ను విజయవాడ వచ్చి తన ఆఫీసులో కలవమని చెప్పారు. అలాగే నేను వెళ్ళగానే ఉద్యోగ నియామక పత్రం నాచేతికందించి ఆపూటే వర్క్ చార్జ్‌డ్ కార్మికన్ గా చేరమన్నారు. నెలకు అన్ని అలవెన్సులతో 64/-రూ. జీతం. అందరికి నేను కేంద్రప్రభుత్వ ఉద్యోగంలో చేరిన విషయాన్ని చెప్పి ఆశ్చర్యంలో ముంచాను. ఆ రోజుల్లో మా పెద్ద బావమరిది కుటుంబ సుబ్బరాయ శర్మ గుణదల కరెంటు ఆఫీసులో గుమస్తాగా పనిచేసేవాడు. అప్పటికి

మా బావమరిదికి పెళ్ళికానందున ఆయనకోసం వేరింటి కాపురం పెట్టాల్సివచ్చింది.

1956లో నాకు ఎంప్లాయిమెంట్ ఎక్స్ఛేంజ్‌నుంచి వ్యవసాయ శాఖలో గుమాస్తా ఉద్యోగానికి ఇంటర్వ్యూకు పిలిచారు. విజయవాడ కృష్ణాజిల్లా వ్యవసాయ అధికారి నన్ను ఉయ్యూరు వ్యవసాయ ఆఫీసులో ఉద్యోగిగా ఎంపిక చేసారు. ఇది ఖాయమైన ఉద్యోగం అనుకొని చేస్తున్న ఉద్యోగాన్ని వదులుకున్నాను. అలా నా ఉద్యోగం రాష్ట్ర ప్రభుత్వ ఉద్యోగిగా స్థిరపడింది. ఈ పరిస్థితుల్లోనే నాతోపాటే నా తమ్ముడ్ని, ఒక చెల్లెలిని తీసుకొని ఉయ్యూరులో కొత్త కాపురం పెట్టాము. తాత్కాలికముగా ఈ ఉద్యోగం చేస్తుండగా సర్వీసు కమీషన్ సెలక్షన్ కూడా వ్యవసాయశాఖకే ఆర్డరు పచ్చింది. అందువల్ల నేను శాశ్వతంగా అదే శాఖలో కొనసాగి పలుపదవుల్లో పనిచేసాను. 23-4-57 ఉదయం 10-00 గంటలకు నాకు కుమారుడు పుట్టాడు.

1957లో నా భార్యకు వింతవ్యాధి వచ్చింది. ఏ వైద్యం పనిచేయలేదు. కోరకుండా వచ్చే బాధల్ని దైవాశీర్వాదంగా స్వీకరిస్తే భగవంతుడే కనికరించి తనవారిగా చేసుకుంటాడన్నది నా విషయంలో నిజమైంది అనూహ్యమైన రోగానికి గురైన నాభార్య, దేవుడ్ని ఏ రూపంలో ఆరాధించినా ఆయన కృపకు పాత్రులగుట తథ్యమని ఋజువు చేసింది. డా॥ జంధ్యాల దక్షిణామూర్తిగారు ఇచ్చిన ఒక బేడ ఖరీదు చేసే 10 బిళ్లలతో రోగం ఎగిరిపోయింది.

మా ఇలవేలుపు వెంకటేశ్వర స్వామి. ఆ స్వామిని సశీరరంతో మెహెర్ దేవుని రూపంలో దర్శించి, స్పృశించి, ప్రసాదం అందుకున్నప్పటికీ నేను ఆయన బాటసారిని కాలేకపోయాను. ప్రియతముని నామము రూపము, ఆయన అందించిన సందేశములపై నా మనసు మరలలేదు. కానీ ఆయన్ని నేను మరచినా, బాబా మాత్రం నన్ను విడువ లేదు. నా జీవితానికి తానే మార్గ దర్శకత్వం వహించి నాకు తెలియకుండానే నన్ను ఆధ్యాత్మిక మార్గంలో తీర్చిదిద్దిన విషయాన్ని చాలాకాలానికి గాని తెలుసుకోలేకపోయాను.

ఉద్యోగరీత్యా 1959లో కైకలూరుకు బదిలీపై కాపురం మార్చాము. మన దేశంలోని 16 శక్తి పీఠాలలో కైకలూరులోని శ్యామలాంబదేవాలయం ఒకటి. అది అప్పట్లో శిధిలావస్థకు చేరి, శిఖరము, ధ్వజస్థంభము, ప్రహరీగోడలు ధ్వంసమై కళ కోల్పోయింది. నేను నా మిత్రులు గుడిపాటి రామకృష్ణారావు లిరువురము కలిసి దాని పునరుద్ధరణకై సంకల్పించాము. అది భగవంతుని నిర్ణయమా అన్నట్లు, స్వామి శివానంద భారతి అవధూతగారు కైకలూరు వేంచేయటం, వెతుక్కుంటూ స్వయంగా మా యింటికి వచ్చి నన్ను ప్రేరేపించుట జరిగిపోయింది.

వారు తమ బృందంతో ఎవరింటికి వెళ్ళి పాదపూజ చేయించుకున్నా తాను మాత్రం మా ఇంటికి వచ్చి ఆతిధ్యం తీసుకునే వారు. అలా నాకు వారి శిష్యరికం

చేసే అదృష్టం కలిగింది. పూజలు, పురస్కారాలు, కర్మకాండలు, మడి ఆచారాలవంటి వాటిపై, మెహెర్ బాబా చెప్పిన సందేశాలనే మాకు ఆయన ప్రవచించే వారు ఈ అవధూత ద్వారానే మెహెర్‌బాబా నన్ను తనకు మరింత చేరువయ్యేట్లు తీర్చిదిద్దారు అనుటలో ఏ మాత్రం సందేహంలేదు. ఆరోజుల్లోనే 19-12-1960 న మాకు ఆడపిల్లపుట్టింది. ఆ పిల్లకు శ్యామల అని ఈ అవధూతగారే నామకరణం చేసారు.

స్వామి శివానంద భారతి అవధూత యుగావతారుని దివ్యనామాన్ని పేరు చెప్పకుండానే, ఆయన ప్రవచించిన సత్యప్రేమ సందేశాలను అనర్గళంగా మనస్సులో నాటుకుపోయేట్లు వివరించి మంత్రముగ్ధుల్ని చేసే వారు. ఆయన శక్తి ఉపాసకులైనందున, ఆయన స్పర్శ ప్రభావము మా కుటుంబముపై ప్రసరించి, అనూహ్యామైన పనులెన్నో నాచేతచేయించింది. కైకలూరులోని సంస్కృత హైస్కూలు వార్షికోత్సవంలో ఈ స్వామిజీ జటావల్లభుల పురుషోత్తం వంటి దిగ్గజముల సమక్షంలో జరిగిన సభలో నా చేత అధ్యక్షోపన్యాసము సంస్కృతంలో చేయించారు. ఈ అవధూత గారి సహకారముతోనే శ్యామలాంబ దేవాలయపునరుద్ధరణ చేయగలిగాము.



ముఖ్యంగా నేను దర్శించిన గురువులకే గురువైన మానవ రూపంలో దిగివచ్చిన పరమేష్టిని పూర్తిగా మరచిపోయినా, ఆయన మాత్రం, నన్ను విడువకుండా నాతోటే ఉండి యీ అవధూత ద్వారా తనను ప్రేమించుటకు ఒక అపూర్వ అవకాశాన్ని ప్రసాదించారు. ఆదరిమిలా నా జీవితంలో జరిగిన ఎన్నెన్నో అనుభవాలు, దైవముగా బాబా అందించిన అద్భుతలీలలుగా మిగిలాయి. 1963 లో మరల చల్లపల్లికి ఉద్యోగరిత్యా బదిలీ కావటం, స్థానిక మెహెర్ సెంటరుతో అనుబంధం ఏర్పడటం మొదలైంది. క్రితంలో ఆవూళ్లో పనిచేసినప్పుడు సో. భట్టిప్రోలు వెంకటరమణారావుగారి ఇంటికి దగ్గరగా ఉండటం వల్ల, తరచూ కలుసుకుని బాబా తత్వంపై చర్చించుకునే వారం. అయినా నా భావాలు మారలేదు. పూజ్యగురుదేవులు స్వామి శివానంద భారతి అవధూత బోధలు ఇప్పుడు నన్నుపూర్తిగా మార్చివేశాయి. నా బాబాను ఎప్పుడు చూడాలా అన్న తపన పెరిగింది. అలా క్రమంగా బాబాకు ఆకర్షితుడను కాసాగాను. 1964 అక్టోబరు 12న బాబా ఆశీస్సులతో మా ద్వితీయ కుమార్తె చి. సౌ. శ్రీలక్ష్మి జననం జరిగింది.

కర్మ కాండలు, ఆచారవ్యవహారాలు, గురించిన అవగాహన స్వామి శివానంద భారతి అవధూత ద్వారా కలిగినా ఆచరణలో ఇంకా చోటు చేసుకోలేదు. అందువల్ల 1964లో నా ఏకైక కుమారుడు చి. పూర్ణచందుకు శాస్త్రరీత్యా ఏడవ సంవత్సరము, ఏడవ నెల, ఏడవ రోజున ఉపనయనమహోత్సవం ఐదు రోజుల పాటు నిర్వహించాము.



నేను 1954 లో నా ప్రియతముని అనుగ్రహమునకు పాత్రుడినైనా, ఆయన్ని ప్రత్యక్షంగా ఆరాధించే అదృష్టంనోచుకోనందున నానిత్యానుష్టానాన్ని వదులుకోలేక పోయాను. ఆచార సాంప్రదాయాలను మానలేక పోయాను. భౌతిక ఆకర్షణలకు మెహితుడనైన నేను, గురుదేవుని అనుగ్రహభాగ్యం కలిగినప్పటికీ, అంత సులభంగా మెహెర్ బాబా ప్రేమ పరిధిలోనికి రాలేకపోయాను. నా దైనందిన విధులలో మునిగి ఉద్యోగభాధ్యతలు నిర్వహిస్తున్నా బాబా సాహిత్యాన్ని సేకరించి చదవటం ప్రారంభించాను. ఈ పుస్తకపఠనం వల్ల, మెహెర్ బాబా గురించి ఆలోచించుటకు ఎంతగానో సహాయపడింది. ఆయన అవతారవిశిష్టత గురించి ఆయన మండలి ప్రముఖుల గురించి విపులంగా తెలుసుకునేట్లు సహాయపడింది.



1965 లో నేను ఘంటసాలలో పనిచేస్తుండగా సో. కె. హరనాధ బాబా ప్రస్తుత ఏలూరు మెహెర్ సెంటరు కార్యదర్శి చల్లపల్లిలో వ్యవసాయడిపోకుబదిలీపై రావటం జరిగింది. ఆయన అప్పట్లోనే బాబా సేవకు అంకితమయ్యారు. మెహెర్ బాబా ఏకాంత వాసములో గడుపుతున్నందున, ఆయన్ని వెళ్ళి దర్శించాలని తపించినా ఫలితములేకపోయింది. ఆదీ. కె. ఇరానీ గారికి నేను బాబా దర్శనానికి అనుమతి కోరుతూ వ్రాసిన ఉత్తరమునకు బదులుగా జాబు వచ్చింది. "**మీరు బాబాకు అర్పణ అయ్యారు కనుకనే అన్యత్రావాటన్నిటి కంటే ఆయన్నే అమితప్రియంగా ప్రేమించకలుగుతున్నారు. మెహెర్ ప్రభువు తన ప్రేమాశీస్సులను, మీ పై కురిపించుటవల్లనే ఆయన దర్శనమునకై మీరింతగా తపిస్తున్నారు. బాబా అనుక్షణం మిమ్మల్ని గుర్తుంచుకున్నారనుటకు మీ పరితాపమే పరమ తార్కాణము.త్వరలోనే బాబా దర్శన భాగ్యం మీకు లభిస్తుందని తలుస్తున్నాను. విడువక బాబా నామస్మరణ చేస్తూ బాబా గురించే ఆలోచించగలరని ఆశిస్తాను. - ఆదీఇరాని.**"

ఆదిజీ జాబు ద్వారా నా జీవితంలో కొత్త ఘట్టం మొదలైంది. ఒక వైపు సంసార వ్యాపకంలో మునిగి ఉద్యోగబాధ్యతలు నిర్వహిస్తూ, మరోవంక, ప్రభుత్వ ఉద్యోగ సంఘం కార్యదర్శిగా పదవీ బాధ్యతలనిర్వహణలో సతమతమయ్యేవాడిని. ఘంటసాల ఆఫీసర్సు క్లబ్ కార్యదర్శిగా పని చేసాను. దివితాలూకా ఎన్.జి.ఒ. సంఘప్రధాన కార్యదర్శిగా ఎనలేని సేవలందించాను. ఐక్యకార్యాచరణ కమిటీ కన్వీనరుగా ఉద్యోగుల కోర్కెల సాధనకు సంఘసేవలో పాల్గొన్నాను. మేము ఘంటసాలలో ఉండగానే మా మామగారు



వేసవి శలవులు గడుపుటకు మా ఇంటికి వచ్చి హఠాత్తుగా తుది శ్వాస విడిచారు. ఆయన మరణం నాజీవితంలో తొలిమలుపు తిప్పింది. ఈ జీవితం బుద్బుద ప్రాయమని, ఈ శరీరం ఏనాటికైనా నశించి పోయేదేనన్నతత్వము నాలో నాటుకుంది. సర్వాన్ని త్యజించాలన్న వైరాగ్య భావం కాదది. నేను విశ్వశించిన మెహెర్ దేవుని పై పరిపూర్ణ విశ్వాసము నుంచి, ఆయన్నే నమ్ముకుని ప్రేమిస్తూ, బాబా కొంగుబంగరు భాగ్యంపొంది తోటి వారికి నిస్వార్ధసేవలదించాలన్న తితీక్షప్రారంభమైంది.

1954 లో నేను తొలిసారిగా మెహెర్‌బాబా దర్శనాన్ని పొందినప్పటికీ, ఒక పుష్కరాకాలము అయితేకాని, ఆయనకు సర్వార్పణ అయ్యే అదృష్టం నాకు లభించలేదు. నేను ఘంటసాల నుండి, నూజివీడు వ్యవసాయ డిపోకు 1966 లో బదిలీ అయ్యాను. అప్పట్లో పశ్చిమ కృష్ణాజిల్లా వ్యవసాయాధికారిగా ప్రియసోదరులు మల్లా అప్పల నాయుడు గారుపనిచేసేవారు. ఆయన ప్రముఖ బాబా ప్రేమికులు, అప్పటికే పలుపర్యాయాలు ప్రియతముని దర్శించిన అదృష్టవంతులు. వారికి క్రింది ఉద్యోగిగా పనిచేసే అదృష్టం కలుగుటవల్ల, నాజీవితగమనము పలుమలుపులు తిరిగింది. శ్రీ అప్పలనాయుడి గారి ప్రోత్సాహంతో, నూజివీడు పరిసరగ్రామాలలో సైతం, మెహెర్‌నామ వ్యాప్తికై వినూత్న కార్యక్రమాలెన్నో నిర్వహించే అదృష్టం కలిగింది. సో. పెమ్మరాజు సుందరశివరావు (వీరికి బాబా పెట్టిన పేరు ఫైర్) ఈయన ఫైర్ స్టేషన్‌లోపనిచేసేవారు) గారు తోడయ్యారు. ఉయ్యూరు ఎస్టేటు జమిందారుగారైన రాజా ఎం.ఆర్. అప్పారావు గారు, ఆరోజులలో ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వంలో మంత్రిగా ఉండేవారు. వీరి అండదండలతో 21-9-1963న మెహెర్ దేవుని ఆశీస్సులతో అవతార్ మెహెర్‌బాబాను నూజివీడు సెంటరు స్థాపించుకున్నాము.

**"ప్రియమైన చంద్రమౌళీశ్వరరావు - నన్ను హృదయ పూర్వకంగా గుర్తుంచుకో - మనస్ఫూర్తిగా నా నామాన్ని స్మరించు - నీకు, నీ ప్రియ కుటుంబానికి, సుందర శివరావుకు నా కార్యక్రమంలో పాల్గొనే అందరికీ నా ఆశీస్సులు. మెహెర్‌బాబా "** అంటూ బాబా తనకృపను వర్షింపచేస్తూ పంపినపై తంతి నాలో చైతన్యాన్ని తట్టి లేపి మమ్ములను బాబా సేవకు పూర్తిగా అంకితమయ్యేటట్లు చేసింది. సో॥ పెమ్మరాజు సుందరశివరావుకు నాకు తోడుగా సో॥ పెనుగొండ మల్లిఖార్జునరావు గారు సహకరించి తన గానమాధుర్యంతో శ్రోతలను ఉర్రూతలూగించేవాడు. మా



కుమారుడు చి. పూర్ణచందు కూడా బాబా సేవలో పాలుపంచుకుంటూ అవతార్ మెహెర్‌బాబా బాల భక్త సంఘాన్ని స్థాపించి, బాబా భజనలు, బాబా భక్తుల కథలు చెప్పుకుంటూ, క్రమంగా మేఘమాల అనే వ్రాతమాసపత్రికను కూడా నడిపాడు. మా కార్యక్రమాల గురించి బాబా కు వ్రాయకపోయినా, ఆనందంతో ముగ్ధులై, తరచుగా పేరుపేరునా ఆయనే ఆశీస్సులు పంపేవారు.

1967 లోనే, నేను పనిచేస్తున్న వ్యవసాయశాఖలోని మినిష్టీరియల్ సిబ్బందికి ఎటువంటి ప్రమోషన్లు లేక, దశాబ్దాల పాటు, చేరిన పోష్టులోనే మగ్గి పోతున్నందున, తోటి సహోద్యోగుల సంక్షేమం కోసం, మినిష్టీరియల్ సిబ్బందిని చైతన్యవంతుల్ని చేయాలన్న సంకల్పంతో, శ్రీ కొమ్మినేని రామారావు, గొంది వెంకటేశ్వర రావు, నేను కలిసి, సుదీర్ఘంగా చర్చించి, అప్పట్లో ఎం.ఎల్.ఏ. గా ఉన్న మాజీ ఎన్.జి.ఓ. సంఘరాష్ట్ర అధ్యక్షులు శ్రీ ఎ.శ్రీరాములు గారు, ఐ.బి.రామకృష్ణారావు గార్లసహకారంతో ఎన్.జి.ఓ. సంఘానికి అనుబంధ సంస్థగా ఆంధ్రప్రదేశ్ అగ్రికల్చరల్ మినిష్టీరియల్ సిబ్బంది సంఘాన్ని స్థాపించుకున్నాము. నేను ముందుగా రాష్ట్రమంతా జిల్లాల వారీగా పర్యటించి నెలకొన్న పరిస్థితులు వివరించి రాష్ట్రంలోని అన్ని జిల్లాల ముఖ్య కార్యకర్తలను విజయవాడకు ఆహ్వానించి జరిపిన సమావేశంలో నేను రాష్ట్రస్థాయి వ్యవస్థాపక అధ్యక్షునిగా శ్రీ గొంది వెంకటేశ్వరరావు ప్రధాన కార్యదర్శిగా, శ్రీ కొమ్మినేని రామారావు కోశాధికారిగా ఏకగ్రీవంగా ఎన్నుకోబడ్డాము. వ్యవసాయ సంచాలకులతో, సంబంధిత అధికారులతో సుధీర్ఘంగా చర్చించిన ఫలితంగా అచిరకాలములోనే మినిష్టీరియల్ సిబ్బంది వ్యవస్థలో సమూలమార్పులు సంభవించి చాలా మందికి పై పదవులు లభించాయి. పబ్లిక్ అకౌంట్సు కమిటీ చైర్మన్‌గా శ్రీశ్రీరాములు గారి సేవలు మాకు అనుకూలించి ప్రమోషన్లలో మంచి ఫలితాలు లభించాయి.



1968 సెప్టెంబరు 23 నుండి తొమ్మిది రోజుల పాటు, వినూత్నరీతిలో అవతార్ మెహెర్‌బాబా సెంటరు తరపున బాబా నవరాత్రిమహోత్సవాలు అత్యంత వైభవంగా బాబాఅనుమతితో నిర్వహించాము. దేశం నలుమూలలనుండి బాబా ప్రేమికులను ఆహ్వానించి తమ అమూల్యసందేశాలను ప్రజలకు వినిపింపచేశాము. బాబా దివ్య అష్టోత్తర శతనామా వళిని నిత్యం వివిధ పుష్పాలు, పత్రములు, కుంకుమతో లక్షసార్లు, వేలాది మంది పాల్గొని పూజలు చేస్తూస్మరించిధన్యులయ్యారు. భక్తులు తెచ్చే ప్రసాదాలను ఏపూటకాపూట పంచిపెట్టేందుకు పదిమంది జగజట్టీలైన బాబా కార్యకర్తలు నానా తంటాలు పడి ఆయాసపడేవారు. ఆ తొమ్మిదిరోజులూ మెహెర్

బాబా తన ఆనందాన్ని వ్యక్తపరుస్తూ ప్రతిరోజూ కార్యక్రమంలో పాల్గొంటున్న భక్తులకు, కార్యకర్తలకు తన శుభాశీస్సులు తెలుపుతూ టెలిగ్రాంలు పంపారు. ఈ సందర్భంలోనే బాబా నన్ను రచనావ్యాసంగంలో పురికొల్పి, భగవద్వచనములు పుస్తకాన్ని ఆదీజీ ద్వారా పంపి రెండు సార్లు చదివి తెలుగులో అనువదించమని ఆదేశించారు. అయితే బాబా శరీరంతో ఉండగా ఒకసారి కూడా చదవలేకపోయాను.

మెహెర్‌బాబా 74వ జన్మదిన వేడుకలను 12 డిశంబరు 1968 నుండి భారీ ఎత్తున నూజివీడు సెంటరులో ఘనంగా ప్రారంభించాము. 1969 మే, జూన్ నెలలలో పూనాలో మెహెర్‌బాబా ప్రజాదర్శనమిస్తానని ప్రకటించుటవల్ల, ప్రత్యేక రైళ్ళను రాష్ట్రస్థాయిలో నడిపి, ఆంధ్రా ప్రేమికులను తీసుకువెళ్ళాలని, సో॥ మాజేటి రామమోహనరావు చింతా సర్వారావుగారలు బాధ్యత వహించగా మా వంతుకృషిగా పాల్గొనే యాత్రీకులను బుక్ చేస్తున్నాము. అందరం బాబా 74వ జన్మదినోత్సవ కార్యక్రమంలో నిమగ్నమయ్యున్నాం. 1969 ఫిబ్రవరి 1 వ తేదిన ఉదయం 5-00 గంటలకే దినపత్రిక అంది. అవతార్ మెహెర్‌బాబా మరణించారన్న వార్త చదివి నిశ్చేష్టుడినయ్యాను. క్షణం ఆలోచించకుండా ఏమిచేయాలో పాలుపోక, మాజేటి రామమోహనరావుగారిని కలిసి నిర్ణయం తీసుకోవాలనుకొని, కట్టుబట్టలతో, విజయవాడ బయలుదేరాను. ఆర్.టి.సి. సమ్మెజరుగుతున్నందున, అందిన లారీ ఎక్కి ఉదయం 8-00 గం.లకు రామమోహనరావుగారింటికి వెళ్ళగా, అంతా బస్‌స్టాండులో ఉన్నారని తెలిసి, హడావిడిగా అక్కడకు చేరగా, విజయవాడ బాబా ప్రేమికులంతా ఎక్కిన బస్సు బయలుదేరబోతున్నది. సో.ఎం. సత్యనారాయణ ఎ.ఎస్. జగన్నాధులు నన్నుచూచి బస్సు ఆపి, నన్నూ ఎక్కమన్నారు. బ్యారేజీ వద్దకు చేరేలోపు, వారంతా బాబా దర్శనానికి మెహెరాబాదు వెళుతున్నట్లు తెలిసింది.



నేను అలా ప్రయాణం చేసేందుకు తయారైరాలేదు. కేవలం ఏమి జరిగిందో తెలుసుకొనుటకువచ్చాను. జత బట్టలులేవు. సరిపడిన పైకం లేదు. కనుక దిగిపోతాననగానే, ఎం. అప్పలనాయుడుగారు, తదితరులు మా బట్టలు ఇస్తామని, అవసరమైన పైకాన్నిస్తామని ఈ అవకాశాన్ని ఉపయోగించుకోమని ప్రోత్సహించుటతో నేనూ వారిని అనుసరించాను. అప్పటికప్పుడు సికింద్రాబాద్‌లో ప్రత్యేక బోగిని ఏర్పాటు చేసి, 2వతేదీ ఉదయానికి మెహెరాబాదు చేరాము. బాబా శరీరం నిద్రపోతున్నట్లు, సమాధిలో దర్శనమిచ్చింది.

అయిదుమెట్లు దిగి బాబా పాదస్పర్శచేయగానే, నాకు కరెంటు షాకు తగిలినట్లు

అనుభవమైంది. 1954 ఫిబ్రవరి 21 విజయవాడ దర్శనంలో బాబా చేతులతో అరటిపండు ప్రసాదం అందుకున్నప్పుడు అనుభవమైనట్లు వళ్ళు జల్లుమనిపించింది. మా భోగీ 5 వ తేదీ వరకే బుక్ అయినందున, ఉన్న మూడు రోజులూ నేను కట్టుబట్టలు తోటే వుండిపోయాను. అవసరమైన ఖర్చులన్నీ శ్రీ అప్పలనాయుడు గారే భరించగా ఇంటికి తిరిగి రాగానే బాకీ తీర్చాను. మెహెరాబాదు, మెహెరాజాదు లోని బాబా ప్రదేశాలన్నీ సందర్శించాము. ఏకాంత కొండపైకెక్కివచ్చాము. బాబా స్వయంగా పెంచిన దానిమ్మ చెట్టు కాయను కాపలాదారుకోసి ఇవ్వగా, సమాధిలోని బాబా పాదాలకు దానిని తాకించి, మహాప్రసాదంగా తెచ్చుకున్నాను.

నా తొలి ప్రయత్నంగా బాబాపై కరపత్రాల ప్రచురణ మొదలు పెట్టాను. అచిరకాలంలోనే సహచరులైన పెద్దల ప్రోద్భలంతో గ్రంధరచనలకు పురికొల్పబడ్డాను. "ప్రేమ కానుక" అనే నా తొలి గ్రంధావిష్కరణ సందర్భంగా ఆదీజీ ద్వారా 21-9-1968న బాబా పంపిన ఆశీస్సులతో నాకు ఒక సందేశాన్ని అందించారు. " **అవతారుడి చరిత్ర వ్రాయలన్నా, ప్రసంగించాలన్నా, పెనుతుఫానులో అల్లకల్లోలంగా ఉన్న తుళ్ళిపడే సముద్రంలో, ఈత నేర్చుకొనుటకు ప్రయత్నించుట వంటిది. "సంకల్పం నాదైతే, ప్రేరణనాదైతే, వ్రాసేది, వ్రాయబడేది అన్నీ నేనే అవుతాను. నీకు నా ఆశీస్సులు - మెహెర్‌బాబా"** బాబా పంపిన ఈ సందేశం నాకు ఆదేశంగా పనిచేసింది. నా ప్రసంగాలలో, నా రచనలలో కొత్త పంధామొదలైంది. మాటలతో పనిలేని ఆయన చేతల కార్యక్రమానికే ప్రత్యేకతనిచ్చి, బాబా అనుభూతులను ఆస్వాదించిన వ్యక్తుల సంఘటనలను వెలికి తీసి ప్రజలకందించుట ప్రారంభించాను. ఏకాంతంలో ఉన్న మెహెర్‌బాబాకు నాకథనంతా వివరంగా బాబాకు జాబు వ్రాయగా, **"ప్రియమైన చంద్రమౌళీశ్వరరావు - నీకు నీ ప్రియకుటుంబానికి నా ఆశీస్సులు - నా నామాన్ని హృదయపూర్వకంగా స్మరించు - నా కార్యక్రమాలను చేపట్టు - నేను నీకు సహాయపడతాను - మెహెర్‌బాబా"** అని ఒకటెలిగ్రాం వచ్చింది.

బాబా పంపిన తంతిని ఆదేశంగా తీసుకుని, విధి నిర్వహణ చేస్తూ, తీరిక సమయంలో నిరంతర బాబా సేవకు అంకితమయ్యాను. సనాతన సాంప్రదాయాలతో నిత్యానుష్టానముచేసుకునే నేను, బాబా ప్రేరణతో ఆచార అనుష్టానాలను వదిలి, జాతి, కులమత భేతం లేకుండా దైనందిన జీవితంలో కలిసిపోవటంతో, నాకుటుంబంలో వ్యతిరేక వాతావరణం కొద్దిగా పొడసూపింది. మెహెర్‌బాబా వల్లనే, నేను ఇలా తయారయ్యానన్న భావన ఏర్పడింది. బాబా ఫోటోను, విజయవాడలోని మా నాన్నగారింట్లో ఉంచితే పక్కన పెట్టారు. 1968 అక్టోబరు 21 న మా నాన్నగారు విజయవాడలో అనారోగ్యంతో చరమ స్థితిలో వున్నారని మా తమ్ముడు జి.వి. సత్యనారాయణ రావు నూజివీడు వచ్చి మమ్మల్ని తీసుకువెళ్లాడు. నేను బయలుదేరుతూ

నూజివీడు నుండే మెహెర్‌బాబాకు "నాన్నగారు జబ్బులో ప్రమాదకరంగా వున్నారు. ఆశీస్సులర్ధిస్తున్నాను". అని రిప్లైపెయిడ్ టెలిగ్రాం పంపాను. అదే రోజు రాత్రికి మా నాన్న గారు (21-10-1968) తుది శ్వాసవిడిచారు. ఆరోజు కృష్ణాపుష్కరాల రెండవరోజు. తెల్లవార్లు నేను భగవద్వచనములు గ్రంథం, మా కుటుంబ సభ్యులకు చదివి వినిపిస్తూ గడిపాను. మరుసటి రోజున శ్రీ ఎం. అప్పలనాయుడిగారి సారధ్యంలో స్థానిక బాబా ప్రేమికులంతా వచ్చి బాబా ప్రార్ధనలు చేసి, హారతిచ్చారు. నాకు కర్మకాండలు శాస్త్రయుక్తంగా చేయాలని ఇష్టం లేకపోయినా, మా కుటుంబ పెద్ద అయిన మేనమామ మద్దాలి లక్ష్మీనాగభూషణరావు గారి సలహాపై, యధావిధిగా అంత్యక్రియలు పూర్తి చేశాము.

మెహెర్‌బాబా సర్వజ్ఞుడు. ఆయన కార్యవిధానం మన ఊహలకందదు. ఆయన చేసే ప్రతి చర్యలోను తన అవతార విశిష్టతస్పష్టంగా వ్యక్తమవుతుంది. మెహెర్ అవతారుని గురించి మా నాన్నగారికి పంపిన టెలిగ్రాం బాబాకు అందేసరికి మానాన్నగారు మరణించి నందున, బాబా తన తిరుగు జవాబును నా నూజివీడు చిరునామాకు పంపుటకు బదులుగా విజయవాడలోని శ్రీ మాజేటి రామమోహనరావుగారి కేరాఫ్ అడ్రసుతో ఈ తంతిని పంపారు. **"నీకు నాయందు ఉన్న ప్రేమ, మీ తండ్రికి మరుజన్మ లేకుండా నాలో శాశ్వతంగా చేర్చినది. - మెహెర్‌బాబా"** మా నాన్నగారికి బాబా గురించి తెలియకపోయినా, నాకు మెహెర్‌బాబా యందున్న ప్రేమ ఆయన్ని ఎలా ఆనందపరచిందో యీ టెలిగ్రాం ద్వారా తెలుసుకుని, మా నాన్నగారి దశదినకార్యక్రమాలను బాబా భజనలతో ఒక శుభకార్యంలాగా నిర్వహించాము.

అప్పటి నుండి, ఒక వైపు ఉద్యోగవిధులు సక్రమంగా నిర్వర్తిస్తూ "ప్రియతముని దివ్యనామాన్ని" భిన్నమార్గాలలో ప్రజలదృష్టికి తెచ్చే అవకాశాన్ని నాకు బాబా ప్రసాదించారు. 1986 వరకు అవతార్ మెహెర్ బాబా ఆంధ్రా సెంటరు ఉపాధ్యక్షుడిగా అవతార్ మెహెర్ పత్రికకు సహాయ సంపాదకునిగా, పబ్లిషర్‌గా, ప్రచురణ కర్తగా బాధ్యతలు వహించుటతో పాటు ఆంధ్రాసెంటరు ఉపాధ్యక్షుడిగా బరువైన బాధ్యతను చేపట్టాను. అటు ఆంధ్రాసెంటరు నిర్వహణలోను, ఇటు అవతార్ మెహెర్ పత్రికాప్రచురణలోను గణనీయమైన సేవలందిస్తూ బాబానామ వ్యాప్తికి దోహదపడే అదృష్టం నాకు లభించింది. అంతా బాబా ఇచ్చే నన్నట్లు, నాజీవితంలో కూడా ఎన్నో మార్పులు చోటు చేసుకున్నాయి.

జన్మతః మాది విజయవాడ స్వంతనగరం. మా తల్లిదండ్రులు బంధువర్గమంతా విజయవాడలోనే స్థిరపడ్డారు. నేను కేవలము ఉద్యోగరీత్యా నూజివీడు బదిలీపై వచ్చి కాపురం పెట్టాను. బాబా ప్రేమకు అంకితమై ఆయన్ని సేవించేందుకు నాకు నూజివీడు ముఖ్యకేంద్రమైంది. ఆయన సేవకు అవతార్ మెహెర్ బాబా నూజివీడు సెంటరును

స్థాపించేట్లు బాబాయే ప్రోత్సహించినందువల్ల, సెంటరు కార్యక్రమాలు అతి వైభవంగా జరుగసాగాయి. ఆది. కె. ఇరాని, తాడిమేటి కుటుంబశాస్త్రి సి.డి.దేశ్‌ముఖ్, పి.డి. పుకార్, హెచ్.పి. భరూచా, అమర్‌సింగ్ సైగల్ వంటి ప్రముఖులెందరో నూజివీడు సెంటరును సందర్శించి, అమూల్యమైన బాబా సందేశాలను అందించగా వారి ప్రసంగాలను తెలుగులో తర్జుమా చేసి చెప్పే అదృష్టం నాకు లభించింది. మేమున్నది అద్దె ఇల్లుకనుక, బాబా కార్యక్రమాల కోసం, పెద్దహాలున్న ఇంటిని అద్దెకు తీసుకున్నాం. మా ఆర్థిక పరిస్థితులు బాగా తెలిసిన నా మిత్రుడు శ్రీ గుడిపాటి సూర్యనారాయణగారు ఒక స్థలాన్ని మా పేర కొని దస్తావేజులు వప్పగించి, ఆస్థలంలో ఒకపాక నైనా కట్టుకొని అద్దెఇంటిని ఖాళీ చేసి కాపురం పెట్టమని సలహాఇచ్చారు.

జరిగిన విషయాన్ని వివరంగా బాబాకు జాబువ్రాసి తగు సలహా ఇవ్వమని కోరాను. విజయవాడలో మాకు ఆస్తులున్నాయని, యీ స్థలాన్ని ఏమి చేయమంటారని వ్రాశాను. తిరుగు టపాలోనే బాబా నుంచి సందేశం అందింది. **“ నీవు విజయవాడను మరచిపో, నూజివీడు స్థలంలో నాపేరుతో ఇల్లుకట్టి, నా కార్యక్రమాలకు అంకితమైపో. - మెహెర్‌బాబా”** అంటూ తన కార్యకర్తగా నన్ను బాబా మార్చివేశారు. ఆవిధంగా, ఎటువంటి సంబంధంలేని నూజివీడుతో నాకు శాశ్వత అనుబంధం ఏర్పడింది. బాబా ఆదేశంపై బాబా శరీరత్యాగానంతరం మేము ఆస్థలంలో **“మెహెర్ నిలయం”** పేరుతో ఇల్లు కట్టుకున్నాము. సో. ఆదీ కె. ఇరానీ, అవతార్ మెహెర్ బాబా ట్రస్టు చైర్మన్ అయిన కుటుంబశాస్త్రి గారితో కలిసి వచ్చి, బాబా స్వయంగా స్పృశించిన రాళ్ళను తెచ్చి శంఖుస్థాపన జరిపారు. ది. 4-12-1969 న గృహప్రవేశం చేసి బ్రహ్మాండమైన బాబా సహవాస్ నిర్వహించాము. అదే సంవత్సరములో నూజివీడు తాలూకా ఎన్.జి.ఓ. సంఘప్రధాన కార్యదర్శిగా ఉద్యోగుల సహకారంతో అనేక సాంస్కృతిక కార్యక్రమాలు, సేవా కార్యక్రమాలు నిర్వహించటమేకాక సంయుక్త కార్యాచరణ కమిటీ చైర్మన్‌గా అవిరళకృషిచేసి 12-4-1971 నుండి 6-6-71వరకు 56 రోజులు పాటు అన్ని తరగతుల ప్రభుత్వ ఉద్యోగులను సమన్వయపరిచి, విజయవంతంగా కోరికలసాధనకై సమ్మెను నిర్వహించుట జరిగింది. నాయకుల శ్రేణి కార్యకర్తల ఆరెష్టుకు ప్రభుత్వం పూనుకున్నపటికీ వెనుకాడక, పోరాటం సాగించాము.

తాత్కాలిక ఉద్యోగులను వివిధ కార్యాలయాలలో ప్రభుత్వం నియమించగా వారిని ఎదుర్కొని, తమ విధులకు వెళ్ళకుండా అడ్డుకున్నందుకు నన్ను పోలీసులు అరెష్టుచేయగా ఉద్యోగులంతా సమిష్టిగా అడ్డుకొని, కష్టడీనుండి విడుదల చేయించటం, ఉద్యోగుల మధ్య ఉన్న సమైక్యతకు ప్రబలతార్కాణం. సమ్మె చేస్తున్న ఉద్యోగులంతా తమకుటుంబాలతో కలిసి పలుపర్యాయాలు పట్టణ వీధులలో ప్రదర్శన జరిపి, ప్రజల సానుభూతిని పొందటం జరిగింది. రెక్కాడితేకాని డొక్కాడని వైట్‌కాలర్ ఉద్యోగులకు

సమ్మెకాలంలో వ్యక్తిగత హామిపై బియ్యాన్ని అప్పుగా ఇప్పించే ఏర్పాటు చేశాను. సమ్మె విజయవంతమై ముగియ గానే, ప్రభుత్వం కక్ష సాధింపు చర్చలు చేపట్టమని హామీని ఇచ్చినప్పటికీ, నన్ను నూజివీడు నుండి తిరువూరుకు బదిలీ చేశారు. 24-9-71న, తిరువూరు వ్యవసాయ డిపోలో జాయిన్ అయ్యాను.

నేను బదిలీ అయినప్పటికీ బియ్యం అప్పుగా తీసుకున్న ఉద్యోగులంతా నాయందున్న ప్రేమాభిమానములవల్ల తమ జీతాలు తీసుకోగానే వ్యాపారస్తులకు చెల్లించుట జరిగింది. బాబా నేర్పిన సేవాధర్మప్రావీణ్యతను అక్షరాలాపాటించినందువల్లనే ఇది సాధ్యపడిందని గ్రహించాను. తిరువూరులో ఉద్యోగభాధ్యతలు చేపట్టగానే, స్ధానిక ఎన్.జి.ఓ. సంఘ ఎన్నికలు జరగటం నేను ప్రధాన కార్యదర్శిగా ఏకగ్రీవంగా ఎన్నిక కావటం జరిగింది. ఈలోగా తెలంగాణా, ఆంధ్రా ప్రాంతీయ పోరాటాలు ఊపందుకున్నాము. అదే సమయంలో ప్రభుత్వోద్యోగులంతా కలసి సంయుక్త కార్యాచరణ కమిటిగా ఏర్పడి 111 రోజులపాటు 7-12-1972 నుండి 24-3-72 వరకు సమైక్యపోరాటం జరుపుట జరిగింది. తిరువూరు కార్యాచరణ సమితి కన్వీనరుగా నేను నాయకత్వం వహించాను. దాదాపు నాలుగు నెలలు కొనసాగిన యీ పోరాటంతో నెలసరి బత్తెంగా కనీసం తిండి గింజలు ప్రతి ఉద్యోగికి అందించవలసి బాధ్యత నాయకులపై పడింది. జిల్లా స్థాయి నాయకత్వం కొంత వరకు బియ్యం సరఫరా ఉచితంగా ఏర్పాటు చేసినా, సిబ్బంది అవసరాలకు సరిపోనందున, నేను వ్యక్తిగతంగా లాయర్ నాగేశ్వరరావు గారి ద్వారా పూచీకత్తు వ్రాసి, ఆయాకార్యాలయపు డ్రాయింగు అధికారుల ద్వారా హామి పత్రాలు తీసుకొని అవసరమైన బియ్యం, సరుకులు, వ్యాపారుల ద్వారా అప్పుగా ఇప్పించాను. సమ్మె విరమణానంతరం, అప్పులు తీసుకున్నవారంతా బకాయిలు చెల్లించినందున, సుఖాంతమైంది.

1973లో రాజస్థాన్‌లోని జయపూర్‌లో జరిగిన అఖిలభారత రాష్ట్రప్రభుత్వోద్యోగుల సమాఖ్యసభలలో, సభ్యుడిగా పాల్గొన్నాను. అదే సమయంలో ఢిల్లీలో జరిగిన సభలో పార్లమెంటు కార్యక్రమంలో పాల్గొని ఢిల్లీ వీధుల్లో కదంతొక్కాము. దైవభక్తితో పాటు నన్ను సేవానిరతిలో సైతం, యీవిధంగా ముందంజ వేయించిన ప్రియతమ బాబాకు సర్వదాకృతజ్ఞుడను. మరో ముఖ్యమైన విషమేమంటే, విజయవాడ మరచిపొమ్మనమని, నూజివీడులో ఇల్లుకట్టుకుని తన సేవకు అంకితము కమ్మనమని బాబా ఆదేశించినప్పటికి, ఇల్లు కట్టుకుని గృహప్రవేశం చేసిన సంవత్సరం తిరగకుండానే తిరువూరుకు బదిలీ అయ్యాను. మళ్లీ అక్కడ కూడా కొనసాగనీయకుండా విజయవాడకే బదిలీ అవటంతో విజయవాడ వెళ్ళాలా? వద్దా? అన్నమీమాంశ కలిగింది. నేను సో. చింతాసర్వారావు గారు మెహెరాబాదు వెళ్ళి సో. ఎరుచ్, సో. మణిజ ఇరానికి జరిగినదంతా వివరించి, సలహాకోరాము.

విజయవాడ మరచిపొమ్మని బాబా చెప్పారుగనుక ఇప్పుడు వెళితే అవిధేయత క్రిందకు వస్తుందేమోనన్న మా సంశయాన్ని, సో. మణి, ఎరుచ్ లిరువురూ సులభంగా తీర్చారు. సో॥ మెహెరా కూడా బలపరిచారు.

బాబా ఇచ్చిన ఆదేశం నా జీవితానికి సంబంధించినది. ప్రభుత్వోద్యోగిగా, పై అధికారులిచ్చిన ఆదేశం నా బదిలీ. వారిచ్చే జీతంపుచ్చుకుంటున్నందున, అధికారులిచ్చిన ఆదేశం పాటించుట విద్యుక్తధర్మమని బాబా ఆదేశానికి ఇది ఏ మాత్రం సంబంధం లేదని అవిధేయత క్రిందకు రాదని చెప్పగా 1-8-73 న విజయవాడలో ఉద్యోగ బాధ్యతలు చేపట్టి కుటుంబంతో స్థిరపడ్డాను.

ఇక్కడ నా జీవితంలో మరో కొత్తమలుపు తిరిగింది. పిల్లల చదువులు, కుటుంబబాధ్యతలు పెరిగాయి. నూజివీడు వదిలి వెళ్ళినప్పటికీ బాబా సెంటరు నిర్వహణాబాధ్యత నన్ను వదలలేదు. నూజివీడు మెహెర్‌బాబా సెంటరు మా ఇంట్లోనే స్వంత భవనం కట్టుకునే వరకు కొనసాగింది. కార్యకర్తలెవరూ మిగలకపోయినా సో॥ పెనుగొండ మల్లిఖార్జునరావు కొద్దిమంది ప్రేమికుల సహకారంతో వారం, వారం జరిగే ప్రతి ఆదివార కీర్తనా కార్యక్రమాలుచేసేవాడు. అమరతిధి, జన్మదిన కార్యక్రమాలు భారీ ఎత్తున జరిగేవి. గతంలో బాబా ఇచ్చిన ఆదేశం ప్రకారం, విజయవాడ సెంటరులో జరిగే గురువారం ఆదివారం కార్యక్రమాలలో భగద్వచనములు పై ప్రసంగించుట ద్వారా ఒకసారి క్షుణ్ణంగా గాడ్ స్పీక్సు చదివే అవకాశం నాకు కలిగింది. రెండవ సారి చదివే అవకాశం బందరుకు బదిలీ అయినప్పుడు లభించింది. ఒక సంవత్సరం పాటు మళ్లీ మచిలీపట్నం సెంటరులో కూడా భగవద్వచనములపై ప్రసంగించుట జరిగింది.





1977 లో అవతార్ మెహెర్ బాబా ఆంధ్రా సెంటరు అధ్యక్షులు సో. తొటధనపతిరావు గారి మరణం వల్ల సో. చింతాసర్వారావు గారు అధ్యక్షులయ్యారు. ఉపాధ్యక్షునిగా నన్ను ఎంపిక చేయుటవల్ల, ఆంధ్రాసెంటరు కార్యక్రమాల్లో చురుకుగా పాల్గొనే అవకాశాన్ని సో॥ సర్వారావుగారు నాకు కల్పించారు. ఇరువురం కలిసి, పలు పర్యాయములు రాష్ట్రంలో బాబా సెంటర్లన్నీ పర్యటించి వచ్చాము. 1954 సెప్టెంబరు సహవాస్‌లో

రాష్ట్రంలో 76 మెహెర్ సెంటర్లున్నాయని బాబా ప్రకటించారు. ఆ తర్వాత ఎన్ని సెంటర్లు మిగిలి పనిచేస్తున్నాయో, ఎన్ని సెంటర్లు కొత్తగా స్థాపించబడినవో అంచనా తెలియని ఆ రోజులలో ఆంధ్రా, తెలంగాణా, రాయలసీమ ప్రాంతాలలోని ప్రముఖ బాబా ప్రేమికులతో సాన్నిహిత్యాన్ని ఏర్పరుచుకుని సో॥ సర్వారావుగారు, వై. మాణిక్యాలరావుగారు తదితరులతో కలిసి మేము నిర్వహించిన సమిష్టి కృషి ఫలితంగా అనేక పట్టణాలు, గ్రామాల్లో కొత్తగా మెహెర్ సెంటర్లు అనేకం స్థాపించుట జరిగింది. ప్రతి సెంటరు కార్యక్రమాలలో పాల్గొని బాబా సందేశములు వినిపించుటద్వారా, బాబా ప్రేమికులతో సాన్నిహిత్యం ఏర్పడింది. బాబా సాహిత్యంపై రచనా వ్యాసంగం కూడా పెరిగింది.

సో॥ చింతా సర్వారావుగారి చొరవతో మరుగునపడి వున్న శ్రీ నిట్ట భీమశంకరంగారు వ్రాసిన మెహెర్‌బాబా జీవిత చరిత్రను 12 భాగాలుగా ముద్రించి ఆంధ్రులకు అందించుట జరిగింది. ప్రచురణ ఖర్చులో అధికభాగం సో॥ సర్వారావుగారి సన్నిహితుల నుండి వెయ్యి రూపాయల వంతున ముందుగా వసూలుచేసి, ఆంధ్రాసెంటరు తరపున ప్రచురించి, ఆ డబ్బుకు సరిపడినన్ని పుస్తకాలు వారికి పంపుట జరిగింది. మరో పర్యాయం, సో॥ బాలనాటుగారి అపూర్వ దర్శనమ్ అయిదు భాగాలు, సో॥ ఎరుచ్‌గారి పురాణ పురుషుడు, మెహెర్ బాబా వ్రాసిన ప్రవచనములు 4,5 భాగాలు, అది అలాగా? తదితర పుస్తకాలు తెలుగులో అనువదింపచేసి మరో పన్నెండు పుస్తకాల సెట్టు ప్రచురించుట జరిగింది. అపూర్వదర్శనం 5,6 భాగాలు, అది అలాగా?, సమాధి – అనంత తార వంటి గ్రంధాలను అనువదించే అవకాశం నాకు దక్కింది.

నా జీవితంలో మచిలీపట్నం బదిలీ అయిన తరవాత కొత్త పుంతలు తొక్కింది. మచిలీపట్నం మెహెర్ సెంటరు ప్రియ సోదరుడు తాడేపల్లి బసవయ్యగారి ఆధ్వర్యంలో నడిచేది. అంతకుముందు నుండే నాతో ఆయనకున్న సాహచర్యం వల్ల, ఉద్యోగరీత్యా నేను అక్కడకు వెళ్లడంతో నా సేవలను, ఆ సెంటరు అభివృద్ధికి ఉపయోగించుటకు సో॥ బసవయ్యగారు శతధా ప్రయత్నించారు. అప్పటికే నా కుమారుడు మెడిసిన్ చదువుతున్నందున, మా కుటుంబం విజయవాడలోనే ఉండిపోవలసి వచ్చింది. నేను రోజూ మచిలీపట్నం వెళ్ళి రాత్రికి తిరిగి వచ్చేవాడిని. నిత్యం చేసే రైలు ప్రయాణం, నా రచనా వ్యాసంగానికి బాగా ఉపయోగపడింది. ఉదయం 5-30 లకు రైలు ఎక్కితే 9-30 లకు బందరు చేరేవాడ్ని. ఆ నాలుగు గంటలు బాబా సాహిత్య పఠనానికి వెచ్చిస్తూ క్రమంగా బాబా సాహిత్యాన్ని, ఆయన అందించిన సత్యప్రేమ సందేశాలను అనువాదం చేయుటకు ఉపయోగపడింది. వీటన్నిటినీ, వీలైనప్పుడు ఇతరులకు చెప్పేందుకు ఉపయోగపడసాగాయి. నేను బందరులో ఒక రూము అద్దెకు తీసుకుని, వండుకుని తింటూ, వృత్తిరీత్యా ఉండిపోవలసివస్తే రాత్రి మకాం చేసేవాడిని. ఇది గమనించిన సో॥ బసవయ్య దంపతులు, అద్దెగదిని ఖాళీ చేయించి, వారింట్లోనే

ఒకగదిలో ఉండమని వత్తిడి చేయగా అంగీకరించక తప్పలేదు.

తీరిక సమయాల్లో, నేను చదివి సంపాదించిన అనేక విషయాల్ని వారి కుటుంబ సభ్యులతో పాటు, సో॥ మణి, సువర్చలాదేవి, తదితరులు విని ఆనందపడేవారు. శలవు దొరికితే నన్ను ఇంటికి వెళ్లకుండా ఆపేవారు. ఈ సందర్భంలోనే సో॥ బసవయ్యగారు, నేను సేకరించే విషయాల్ని పుస్తకరూపంలో ప్రకటిస్తే బాబా ప్రేమికులందరికి ఉపయోగకరమవుతుందని నా వెన్నుతట్టి పురికొల్పారు. అలా నా గ్రంధ రచన ఊపందుకున్నది. నా కలం నుండి పుంఖాను పుంఖాలుగా రచనలు వెలువడ్డాయి. నేనున్నానంటూ సో॥ బసవయ్యగారు ముందుకువచ్చి, ప్రతి పుస్తకానికి టైటిల్సుకు అయ్యే ఖర్చు తానే భరించి, అవతార్ మెహెర్‌బాబా మచిలీపట్నం సెంటరు పేరుతో ప్రచురణ కర్తగా నా రచనలు చాలా వెలువడినవి. ముఖ్యంగా ప్రతి అమరతిధికి మెహెర్‌బాబాపై ఒక పుస్తకాన్ని వ్రాసి, నా ప్రావిడెంటుఫండు నుండి అప్పు తీసుకుని ముద్రింపచేసి జనవరి 31న మండలి వారితో మెహెరాబాదులో అవిష్కరింపచేసి, ఫిబ్రవరి 22వ తేదీన మెహెర్‌బాబా మచిలీపట్నం వచ్చిన సందర్భంగా జరిగే ప్రత్యేక కార్యక్రమంలో పుర ప్రముఖులతో గ్రంధావిష్కరణ సభ జరుగుట ఆనవాయితీగా కొనసాగింది. ప్రస్తుతం బసవయ్యగారి లేనిలోటు తీరుస్తూ సో॥ గుడివాడ రామచంద్రరావు, టి. మెహెర్‌బాబా గారలు చక్కని సహకారమందిస్తున్నారు.

దీనికితోడు అవతార్ మెహెర్ పత్రికా నిర్వహణ, ఆర్ధిక లోపంవల్ల భారమైంది. అయిదువందలలోపే చందాదారులు వుండేవారు. వార్షిక చందా గడువుతీరితే మరల రెన్యూవల్ చాలామంది చేసేవారుకాదు. ప్రోత్సాహంకరువై, పత్రికపై ఉత్సాహం సన్నగిల్లుతున్న సమయంలో, సో॥ చింతా సర్వారావుగారు, ఆర్ధిక వనరులు పెంచే బాధ్యత తీసుకుని, నన్ను వెంటబెట్టుకుని రాష్ట్రమంతా పర్యటించి, జీవిత సభ్యుల్ని చేర్పించుట జరిగింది. ఆ క్రమంలోనే, ప్రచురణ కాకినాడ నుండి విజయనగరానికి మారింది. సో॥ నూతికట్టు కోటయ్యగారు, గుమ్మళ్ల వెంకటేశ్వరరావుగారలు తమ వార్ధక్యం వల్ల పత్రికా నిర్వహణ సాధ్యపడుటలేదని దాని బాధ్యతలను వేరెవరికైనా అప్పగించమని కోరినందున సో॥ డా॥పి. రామచంద్రన్‌గారిని ప్రధాన సంపాదకునిగా, నేను, సో॥ త్రినాధరధో, చాగంటి సుబ్బారావుగారలను సహసంపాదకులుగా ఆంధ్రా సెంటరు కార్యవర్గ సమావేశంలో ఎన్నుకొన్నందున, ముఖ్య కార్యస్థానం కాకినాడ నుండి విజయనగరానికి మారింది.

సో॥ రామచంద్రన్‌గారు అస్వస్థులగుట వల్ల ఏలూరులో జరిగిన ఆంధ్రా సెంటరు కార్యవర్గ సమావేశంలో ఏడాది తిరగకుండానే నన్ను ప్రధాన సంపాదకునిగా పబ్లిషర్‌గా, ప్రచురణకర్తగా, సో॥ ఎ.వి. రాఘవులు, ఎం. సత్యనారాయణ, ఎ.ఎస్. జగన్నాద్‌లను సహసంపాదకులుగా ఏకగ్రీవంగా ఎన్నుకున్నారు. జూన్ నెల 1987 నుండి పత్రికా ప్రచురణ విజయనగరం నుండి విజయవాడకు మారింది. కేవలం 28 వేల బ్యాంకు

బ్యాలెన్సుతో అవతార్ మెహెర్ నిర్వహణా బాధ్యతను చేపట్టిన నేను తరచుగా సర్వారావుగారు, ఎ.ఎస్. జగన్నాథ్‌లతో కలిసి రాష్ట్రంలోని పలు మెహెర్‌బాబా సెంటర్లకు పర్యటించి, చందాదారులను చేర్పించే బాధ్యతను చేపట్టినందున సదరు బ్యాలెన్సు లక్షా ఏభైవేలకు పెంచుట జరిగింది. చందాదారుల సంఖ్యకూడా రెండువేలకు చేరింది.

ఈ పత్రిక 1956లో మెహెర్‌బాబాగారి ప్రమేయంవల్ల ఆయన సూచనల ప్రకారం, సో॥ చింతా సర్వారావు, మాజేటి రామమోహనరావు, డా॥ కనకదిండి సూర్యనారాయణ తదితరులు మెహెరాబాదునుండి తిరిగివస్తూ, ఖురుద్వాడీ స్టేషనులో ఆగినప్పుడు తలాకాస్త విరాళాలిచ్చి, అవతార్ మెహెర్ పేరుతో ప్రతినెలా ప్రచురించాలని నిర్ణయించుట జరిగింది. ఆ వెనువెంటనే ఏలూరు నుండి పత్రిక ప్రచురణ మొదలైంది. అలా మొదలైన పత్రిక, దినదినాభివృద్ధి చెందుతూ, ఆంధ్రాసెంటరు తరపున అమూల్యమైన బాబా సందేశాలను అనుభవజ్ఞుల ద్వారా ప్రచురింపబడుతున్న ఏకైక మెహెర్ ఆధ్యాత్మిక మాసపత్రిక నిర్వహణా బాధ్యత నాపై పడటం, బాబా ఆదేశంగా స్వీకరించాను. నా ప్రియతమ దైవంగా మెహెర్‌బాబా పైన పూర్తి విశ్వాసమును వుంచి, ఆయన ప్రేమలోనే గడుపుతూ, ఊరూరూ తిరుగుతూ, బాబా కార్యక్రమాలలో పాల్గొంటూ నేను సంపాదించిన మెహెర్ తత్వపు అమూల్యనిధిని అందరికీ పంచేందుకు అవతార్ మెహెర్ పత్రిక నాకు ఒక సాధనమైంది.

నా జీవితంలో పూర్తికాలము మెహెర్‌బాబా సేవకు అంకితమైనందున, నా కుటుంబం బరువు, బాధ్యతలు నాపై పడకుండా బాబాయే స్వీకరించినట్లున్నారు. 1977లో నేను క్యాంపులో కైకలూరు వ్యవసాయ డిపోలో మా అధికారితో తనిఖీ పనిలో ఉండగా, నా చిరకాల మిత్రులైన గుడిపాటి రామారావుగారు, అయ్యవారి రుద్రవరం నుండి ఎరువులు కొనేందుకు రావటం జరిగింది. కుశల ప్రశ్నలు అయ్యాక, మా పెద్దమ్మాయి చి॥సౌ॥ శ్యామలకు పెళ్ళీడు వచ్చింది, ఏవైనా సంబంధాలు వుంటే చెప్పండి! అని అడిగాను. అంతే, ఆయన వేరే ఏ ప్రస్తావన లేకుండా మా అబ్బాయే ఉన్నాడు, మీకు సమయం వుంటే వచ్చిచూడండి. అబ్బాయి మీకు నచ్చితే, మేము విజయవాడ వచ్చి మీ అమ్మాయిని చూస్తాము, మాకు అమ్మాయి నచ్చితే, పెళ్లికి మేము సిద్ధమేనన్నారు. ఆయన మాటలు విన్న నేను విస్తుపోయాను. మా ఆధికారి శ్రీ వి. బంగారురాజుగారు, కైకలూరు వ్యవసాయాధికారి శ్రీ రవిప్రసాదుగారు నన్ను ప్రోత్సహించి అప్పటికప్పుడే ఆయన్ని వెంటపెట్టుకుని అయ్యవారి రుద్రవరం బయలుదేరాం. వారబ్బాయి చి॥ గుడిపాటి కణ్ణన్ కరిణీకం పరీక్షలు ప్యాసై గ్రామ కరణంగా పనిచేస్తున్నాడు. స్వంత వ్యవసాయాన్ని అజమాయిషీ చేస్తున్నాడు. అమ్మాయికి ఈడూ జోడూ కుదిరిందని, జాతకాలు కూడా కలిశాయనిపించింది.

పిల్లవాడు నచ్చినందున, అమ్మాయిని వచ్చి చూడండని, మీకు ఇష్టమైతే ఇచ్చిపుచ్చుకొనుట గురించి మాట్లాడి లగ్నములు పెట్టుకుందామని చెప్పాను.

ఇచ్చిపుచ్చుకొనుట అనేదేమీ లేదని, కట్నం ఊసు మీ విషయంలో అవసరం లేదని పిల్లనచ్చితే చేసుకుంటామని మరో పర్యాయం తేల్చిచెప్పారు. తరువాత వారు మా ఇంటికి వచ్చి పిల్లను చూచి, నచ్చినట్లు అప్పటికప్పుడే వెల్లడించారు. 27 నవంబరు 1977న వారి వివాహం అతి వైభవంగా విజయవాడలో జరిగింది.



బంధుమిత్రులతోపాటు, అత్యధిక సంఖ్యలో అధికారులు, సహోద్యోగులు, బాబా ప్రేమికులు, రాష్ట్రస్థాయిలో సంఘ సభ్యులు హాజరై వధూవరులను ఆశీర్వదించారు. ఇదంతా ప్రియతముడ్ని నమ్ముకున్న నాకు, మెహెర్‌బాబా అందించిన కృపాకటాక్షమే తప్ప వేరేదీకాదు. ఆ రోజు వేలాదిమంది ప్రాణాలను బలిగొన్న పెనుతుఫాను మొదలయ్యే సమయానికి ముందుగానే పెళ్ళివారు సురక్షితంగా ఇంటికి చేరగలగుట మరో అద్భుతం. వీరు ప్రయాణం చేసిన రైలు మార్గం, రోడ్డుమార్గం కూడా చెట్లు విరిగిపడి కొంతమేర కొట్టుకు పోవడంతో రవాణా సదుపాయం ఆగిపోయింది.

అలాగే మా రెండవ అమ్మాయి చి॥సౌ॥ శ్రీలక్ష్మి పెళ్ళి కూడా బాబా ప్రేరణతో వైభవంగా జరిగిపోయింది. మా పెదనాన్నగారి అల్లుడు శ్రీ మన్నవ సీతారామారావు బావగారు కష్టమ్స్ & సెంట్రల్ ఎక్సైజ్ సూపరింటెండెంటుగా అప్పట్లో పనిచేసేవారు. ఆ దంపతుల ప్రథమ కుమారుడు చి॥ కుమార రఘువరప్రసాద్, ఎం.కామ్‌తో 12-6-1981న వివాహము విజయవాడలో వైభవంగా జరిగింది. ఈ పెళ్లి బాబాయే ఏర్పాటు చేశారు. మా చెల్లెలు చి॥సౌ॥ నాగ వరలక్ష్మి కామేశ్వరి మేము ఉన్న



ఇంట్లోనే క్రింది భాగంలో ఉండేవారు. మేము మేడపై ఉండేవారము. ఒక రోజున మా పెద్దనాన్న, పెద్దమ్మగారి సమక్షంలో పెళ్లి ప్రస్తావన తేవటం, అప్పటికప్పుడు ఖాయపరచు కోవటం జరిగిపోయింది. కట్నకానుకల ప్రమేయం లేకుండానే పెద్ద అమ్మాయికి జరిగినట్లే 12-6-81న వీరి పెళ్లి జరిగిపోయింది.

బాబాను నమ్ముకున్నందుకు ఇదంతా బాబా నాకు ఇచ్చిన నజరానా అని నేను అనుకున్నాను. ఈ పెళ్లికి ముందు రోజు రాత్రి బంధుమిత్రుల రాక మొదలయింది. నేను కళ్యాణమంటపంలో ఏర్పాట్లు చూస్తున్న సమయంలో ఇంటి వద్ద వంటవారు, ఆడవాళ్లతో వాదనకు దిగి, పొయ్యిమీద వంటలు అలాగే వదిలేసి పారిపోయారు. వాళ్లకోసం ఎంత వెదికినా కనిపించలేదు. ఏమి చేయాలో పాలుపోక, బాబా ఫోటో

ముందు నిలబడి **"బాబా! నిన్నే నమ్ముకున్న నాకు ఇప్పుడు దిక్కెవ్వరు? ఇప్పటికిప్పుడు వంటవారు నాకు ఎవరు దొరుకుతారు?"** అని విన్నవించుకుని ఆవేశంతో **"నీవే దిగివచ్చి పొయ్యిమీద వంటలు పూర్తిచెయ్యి"** అంటూ అరిచాను. దానికి బాబా ప్రతిస్పందించారా! అన్నట్లు ఒక అగంతకుడు **"ఏమండీ!"** అంటూ పిలిచాడు. **"ఎవరు కావాలండీ"** అంటూ నేను వెను తిరిగేసరికి, **"దావులూరి చలపతిరావు కావాలి, ఆయన ఇక్కడ ఉన్నాడని తెలిసివచ్చాను, ఎవరి మీదండీ అరుస్తున్నారు?"** అని అడిగాడు. అప్పుడు నా ఆవేదనంతా ఆ యువకుడికి తెలుపగా **"అయ్యా! నేను వంటమాస్టరుని, రేపు ఇదే లగ్నానికి, నిమ్మగడ్డ వారి కళ్యాణ మంటపం దగ్గర్లోని సత్యనారాయణస్వామి దేవాలయంలో జరిగే పెళ్లికి వెయ్యి మందికి వంటచేయాలి. మీరు నిశ్చింతగా ఉండండి. మీ వంటపనికి నేనే స్వయంగా పాల్గొని పూర్తి చేస్తా"**నని బరోసా ఇచ్చి, ఆ పూట వంట పనిపూర్తిచేసి వెళ్లాడు. వంట క్రింద ఎంతపైక మివ్వాలని అడిగితే, మీకు బాబా బుద్ధి పుట్టించిందివ్వమని అయిదువందల రూపాయలకు అంగీకరించాడు. అంతకు ముందు వాళ్లు వెయ్యిరూపాయలకు ఒప్పుకున్నారు. పసందైన వంటకాలతో బ్రహ్మాండమైన భోజనం తయారుచేసి పెట్టాడు. ఈ విషయంలో బాబా ప్రత్యక్ష ప్రమేయం లేకున్నా, నాకు ఆయనయందున్న ప్రేమ, విశ్వాసముల ఫలితమని చెప్పక తప్పదు.

ఇలా నా జీవితంలో అడుగడుగునా ప్రియతమ బాబా అండదండలు అంటిపెట్టుకుని అనుక్షణం సహాయపడుతూనే ఉన్నాయి. నా కుమారుడు డా॥ జి.వి. పూర్ణచంద్ మెడిసిన్ పూర్తిచేసి, స్వంత ప్రాక్టీసు ప్రారంభించాడు. సేవాధర్మాన్ని పాటిస్తూ, పేదలను ఆదుకుంటూ, ఉచిత వైద్యసేవలో, పేరు, ప్రఖ్యాతులు అచిరకాలంలోనే సాధించాడు. లైనిజంలో ప్రవేశించి, అనతికాంలోనే జిల్లాస్థాయికి ఎదిగాడు. అనేకమైన ఉచిత వైద్య క్యాంపులు పలువురు వైద్య నిపుణులతో నిర్వహించి, వైద్యసేవలందిస్తున్నాడు. ముఖ్యంగా కాటరాక్టు ఆపరేషనులు ఉచితంగా చేయించుట, పేదలకు గొప్ప సహాయమైంది. విజయవాడ, నూజివీడు మెహర్ సెంటర్లలో మూడుసార్లు ఉచిత నేత్ర పరీక్షలు ఏర్పాటు చేయించి 300 మందికి పైగా ఉచిత నేత్ర శస్త్ర చికిత్సలు చేయించి, కళ్లజోళ్లు ఇచ్చి, భోజన వసతులు కూడా కల్పించుట జరిగింది. ఈ సందర్భంగా నాకు సో॥ పొట్లూరు నాగేశ్వరరావు, మల్లిఖార్జునరావు, ఎం. సుబ్రహ్మణ్యంగారలు సహకరించారు.



25-12-1983న శ్రీ గోవిందరాజుల దత్తాత్రేయులు బావగారి కనిష్ఠ పుత్రిక చి॥సౌ॥ అరుణాదేవితో మా కుమారుడు చి॥ పూర్ణచందుకు విజయవాడలో అత్యంత వైభవంగా వివాహం జరిగింది. ఈ వివాహంలో కూడా నా ప్రమేయం లేదు.

అంతా ప్రియతమ బాబా ప్రేరణగానే జరిగిపోయింది. మా పెదమామగారి కుమారుడు బొడ్డపాటి ఈశ్వరదాసు బావగారు ఈ సంబంధాన్ని సమకూర్చారు. వారి పెట్టుపోతలు, ఇచ్చే కట్నకానుకలు ముఖ్యంకాదని, కుటుంబం మంచిదని, పిల్ల క్రమశిక్షణలో పెరిగిందని చక్కని సంబంధమని వేరే ఆలోచన చేయక ఖాయపరచుకోమని ఆయన ఇచ్చిన సలహా ప్రకారం, మా అబ్బాయితో పాటు ఇద్దరు అమ్మాయిలు, అల్లుళ్ళు, నా భార్యతో సంప్రదించి, ఒక నిర్ణయానికి వచ్చాము. మా అంగీకారం తెలుపుతూ ప్రియతమ బాబాకు ప్రార్ధనలు చేసి హారతినిచ్చాము. త్వరలోనే వివాహానికి లగ్న నిర్ణయం జరిగింది.



అయితే విధి బలీయమైంది. మా అత్తగారు శ్రీమతి దావులూరు సీతారామమ్మగారు తన మనుమడి పెళ్లిని కళ్లారా చూడాలని వెయ్యి కళ్లతో ఎదురుచూస్తోంది. ఆసమయంలో ఆమె తన పెద్దల్లుడు శ్రీ సీతంరాజు బాబూరావుగారింటివద్ద వరంగల్‌లో ఉన్నారు. ఆమె తన మనుమడి పెళ్లి ఖాయమైందని తెలుసుకుని అపరిమిత ఆనందాన్ని పొందింది. మరో అయిదు రోజులలో పెళ్లి జరుగబోతున్నంతలో, 20-12-1983న ఆమె హఠాత్తుగా హృద్రోగంతో భగవదైక్యం చెందింది. పెళ్ళినాటికి, నా భార్య పుట్టింటి వారెవరూ వచ్చే వీలులేకపోయింది. అప్పటికి ఆమె కర్మకాండలు పూర్తికావు. తల్లికోసం పరితపించటం, కూతురుగా నా భార్య కర్తవ్యమని నాకు తెలుసు. ప్రతి విషయాన్ని మలిచేది బాబాయేనన్న భావన నాలో మెదిలింది. అదే ప్రేరణను నా భార్య జి.ఎస్. ప్రసూనలో కూడా ఆ కరుణామయుడే రేకెత్తించాడు. మా అత్తగారి అంత్యక్రియలకు వరంగల్ వెళ్లి హాజరై ఇద్దరము తిరిగి వచ్చాము. పెళ్ళివారు పెళ్లి పనుల హడావిడిలో ఉన్నారు. శుభలేఖలు అచ్చువేసి, పోష్టు చేయటం కూడా అప్పటికే జరిగిపోయింది.

తల్లి మరణంతో తల్లడిల్లుతున్న నా భార్యలో మెహెర్ బాబాయే స్వయంగా కల్పించుకుని ధైర్యబీజాలు నాటారు. పోయిన తల్లి ఎలాగూ తిరిగిరాదు. బాబా సన్నిధికి చేరిన ఆమె అదృష్టవంతురాలు. అందుకు మనం సంతోషపడాలికాని విచారించ కూడదు. అనవసరంగా పెళ్లితేదీని మార్చి, మనమూ, పెళ్ళివారు కూడా ఇబ్బందులలో పడే బదులు ఇదే లగ్నానికి పెళ్లి జరుపుదామని, నా భార్యే నాకు ధైర్యవచనాలు పలికింది. అప్పటికే మా అత్తగారి దశదిన కర్మకాండలు, కంకిపాడులో వారి స్వగృహహంలో 24-12-1983 నుండి మొదలయ్యాయి. మేమిరువురం, కంకిపాడు వెళ్లి, మా ఇరువురు బావమరుదులను పరామర్శించి, ఆనాటి కార్యక్రమంలో పాల్గొని తిరిగివచ్చాము. మేము నమ్ముకున్న మెహెర్ ప్రభువు అనంతశక్తి జ్ఞానానంద స్వరూపుడదైనందున, మా వెన్నంటి ఉండి, ఇంతటి అవాంతరం ఎదురైనా ఎటువంటి



సంకోచమునకు తావీయక, ఆ మర్నాడు నిరాటంకముగా డా॥ జి.వి. పూర్ణచంద్, చి॥సౌ॥ అరుణాదేవిల వివాహము వైభవంగా జరిపించారు. ముందుగా వధూవరులు మెహెర్‌బాబాను పుష్పమాలాలంకృతుని చేసి, ఇరువురు దండల మార్చుకున్నారు. బాబా ప్రార్థనలు, హారతి ఇచ్చి, వధూవరులను భార్యాభర్తలుగా ఆశీర్వదించుట జరిగింది. అనంతరం, సాంప్రదాయ విధానంలో వివాహ వేడుక జరిగింది.

మెహెర్‌బాబా సేవలో నా కార్యక్రమాలు ఒక చోటుకు పరిమితం కాక, విజయవాడ, నూజివీడు, మచిలీపట్నం సెంటర్లతో సాన్నిహిత్యం పెరిగింది. నరసరావుపేట, చల్లపల్లి, ఏలూరు సెంటర్ల కార్యకర్తలతో ఉన్న అనుబంధం గాఢంగా పెరిగింది. విశాఖపట్నం, విజయనగరం, శ్రీకాకుళం, కరీంనగరు, నిజామాబాదు, ఖమ్మం, వరంగల్ జిల్లాలోని అనేక మెహెర్ సెంటర్ల కార్యకర్తలతో పటిష్టమైన పరిచయాలు ఏర్పడి, తరచుగా వారి కార్యక్రమాల్లో పాల్గొనే అదృష్టం కలిగింది. సో॥ చింతా సర్వారావుగారితో కలిసి రాష్ట్రంలోని అన్ని జిల్లాలలో వున్న మెహెర్ సెంటర్లన్నీ పర్యటించుట జరిగింది. ముఖ్య అతిధులుగానో, ప్రారంభకులుగానో, సహవాస్ నిర్వాహకులుగానో పాల్గొనేవారము. ఇప్పటి వరకు 1012 మెహెర్‌బాబా సహవాస్‌లు నా నిర్వహణలో పూర్తయ్యాయి. 120 సహవాస్ కార్యక్రమాలలో ప్రసంగించాను. మండలి ముఖ్యులైన సో॥ మణిజ, ఇరానీ, ఎరుచ్ జస్సావాలా, అలోబాజీ, పెండూ, పాద్రి, ఆదీ. కె. ఇరానీ, మెహెర్జీ కార్కారియాలతోను, ట్రస్టు బోర్డు ట్రస్టీలైన భావూకల్చూరి, బాలనాటుజీ, రంగోలీ, తదితరులతోను అత్యంత సాన్నిహిత్యం పెరిగింది.

1991లో మా అమ్మగారు గంగరాజు చిన్మయ భ్రమరాంబ తన 84వ ఏట విజయవాడలో బాబాలో ఐక్యమయ్యారు. ఎటువంటి కర్మకాండలు లేకుండా అంతిమ సంస్కారములు జరిపి బంధుమిత్రులు, బాబా ప్రేమికుల మధ్య మెహెర్‌బాబా సహవాస్ జరిపి దివంగత ఆత్మకు నివాళులర్పిస్తూ శ్రద్ధాంజలి సభ జరిపాము. సో॥ చింతా సర్వారావు, డి. ఉమాదేవి, కె. హరనాధ్‌బాబు తదితరులు నివాళులర్పిస్తూ ప్రసంగించారు. బాబా ప్రవచనముల కనుగుణ్యంగా కర్మకాండలేవీ ఆచరించలేదు. దివంగత ఆత్మ శాంతికై ప్రార్ధనలు, హారతి జరిపి పున్నామ నరకం నుండి బయట పడుటకు హాజరైన వారంతా ముక్తకంఠంతో బాబాను ప్రార్ధించుట జరిగింది.



అలాగే మా తమ్ముడు చి॥ సత్యనారాయణరావు వివాహము మా చెల్లెలు వరలక్ష్మి కామేశ్వరి కుమార్తె చి॥సౌ॥ మల్లికతో మచిలీపట్నం బాబా సెంటరులో మం&రతాలేవి లేకుండా నిరాడంబరముగా వివాహము జరిపాము. నాయందు ఎరుచ్ కున్న అపూర్వ వాత్సల్యంవల్ల, బాబా శరీరత్యాగం చేసిన అనంతరం, ఒక రోజున మెహెరాజాదు మండలి హాలులో నేను ఉన్నప్పుడు ఆ రోజున నన్ను ప్రసంగించమన్నారు. తెలుగు ప్రేమికులు ఎక్కువగా ఉన్నందున అంతా నిశ్శబ్దంగా విన్నారు.

ఆ ఏకాగ్రతకు ముగ్ధుడైన ఎరుచ్, చంద్ర అనే మాటకు గుజరాతీ భాషలో ప్రాముఖ్యతను వర్ణిస్తూ నన్ను "మెహెర్‌చంద్ర"గా సంభోదించి, నామకరణం చేశారు. మణీగారు, ఎరుచ్‌గారిని నేను కలిస్తేచాలు, వారిరువురు మాటలు ఆపేసి "ఎడిటరు ఇక్కడున్నాడు, జాగ్రత్తగా ఉండాలి. మనం ఏం మాట్లాడినా పత్రికలో వేస్తాడు" అని నవ్వుకునే వారు. అంతటి మహనీయుల మన్ననలందుకున్నందుననేమో బాబా దూతలుగా సేవలందించే భాగ్యం నాకు లభించింది.

1992 లో నా పదవీ విరమణానంతరం, శేష జీవితాన్ని తుదిశ్వాస వరకు బాబా సేవకే అంకితం చేసుకున్నాను. కొందరు మిత్రులు ఏదైనా ఉద్యోగ ప్రయత్నం చేయమని ప్రోత్సహించినప్పటికి బాబా ఇచ్చినది చాలన్న సంతృప్తితతో, పాతికేళ్ల తర్వాత నూజివీడు వచ్చి స్థిర నివాసం ఏర్పరచుకున్నాను. 1986 నుండి మా మెహెర్ నిలయంలోనే నడుస్తున్న నూజివీడు సెంటరుకు స్వంతభవనం నిర్మించాలన్న సంకల్పంతో వున్న మాకు రాజగోపాల స్వామి దేవాలయ ప్రాంగణంలో శ్రీ రాజా ఎం.ఆర్. అప్పారావుగారు అనుమతించి, వ్రాసి ఇచ్చిన జాగాలో ఉదారులైన బాబా ప్రేమికుల భూరి విరాళములతో 1995లో సుందరమైన భవన నిర్మాణం చేయుట జరిగింది. దాదాపు సగభాగం ఖర్చు మా కుటుంబమే భరించింది.

1994లో బాబా శతజయంతి మహోత్సవాలు ఆ సంవత్సరమంతా రాష్ట్రంలో జరిపించుటకు, అన్ని మెహెర్ సెంటర్ల కార్యకర్తలను స్వయంగా కలుసుకుని బాబా నామాన్ని మార్మోగించే కార్య ప్రణాళికను తయారుచేసే బాధ్యతను ఆంధ్రాసెంటరు అధ్యక్షులు సో॥ చింతా సర్వారావుగారు ఉపాధ్యక్షుడిగా నాపై ఉంచారు. నేను, కార్యదర్శి సో॥ ఎ.వి. రాఘవులు, ఎ.ఎస్. జగన్నాధ్‌లు కలిసి 19-9-1993 నుండి 27-9-1993 వరకు ఖమ్మం, భద్రాచలం, కొత్తగూడెం, వరంగల్, కరీంనగర్, వూడూరు, వెంకటాయపల్లె, కొత్తపల్లి, మెహెర్‌నగర్, చొప్పదండి, ఆర్నకొండ, గొల్లపల్లి, సిరిసిల్లా, లింగంపేట, రామాయంపేట, కామారెడ్డి, లింగంపేట,





కంకల్, నిజామాబాదు, వర్ని, నిర్మల్, అసిఫాబాద్, ఉట్నూరు, కెరమిరి, జనక్‌పూర్, జైనూర్, బెల్లంపల్లి, మంచిర్యాల, జగిత్యాల, హుస్నాబాద్, మల్యాల, ముత్యంపేట, గోదావరి ఖని వంటి 33 మెహెర్ సెంటర్లు సందర్శించాము. వెళ్లిన ప్రతిచోట బాబా ప్రేమికులు అమితోత్సాహంతో మేళతాళాలతో స్వాగతం పలికి దిగ్విజయం చేశారు. ఈపర్యటనలో రెండు వాహనాలను సమకూర్చి, 15 మంది బృందంగా ఆసాంతం, ఆయా జిల్లాలలో మాతో సహకరించిన జోనల్ అధిపతులైన సో॥ ఆర్. రామచంద్రయ్యగారు, ఎన్. కిషన్‌రావుగారు, రెంటాల సూర్యనారాయణమూర్తిగారు అభినందనీయులు.

ఆంధ్రాసెంటరు తరపున తొలిసారిగా నిర్వహించిన ఈ పర్యటన ఊహించని విధంగా విజయవంతమై మమ్మల్ని మెహెర్‌బాబా దూతలుగా స్పందింపచేసింది. ముఖ్యంగా అదిలాబాదు జిల్లాలో దారి పొడుగునా కీకారణ్యంలో పయనించాము. పరవశింపజేసే ప్రకృతిశోభ, ఎత్తుపల్లాలు, లోయలతో కూడిన వంకర టింకర రోడ్లు, పాలరాతిలా మెరిసిపోతున్న తారురోడ్డుపై ఉరకలువేస్తున్న మా కార్లు, ఆ అభయారణ్యంలో పయనిస్తుంటే, నరసంచారము కరువైంది. దూరంగా కొండల్లో బాంబుల మోత, అక్కడక్కడ పోలీసుల కూంబింగు తప్ప మరో ప్రపంచం, మైళ్లకొద్ది ప్రయాణం చేస్తేకాని కనిపించలేదు. అదో వింత అనుభవం. ఒకటి రెండు చోట్ల పోలీసులు అడ్డగించి సోదాచేసిన ఘట్టాలెదురయ్యాయి. ప్రతి సంఘటనలో మెహెర్ దేవుని ప్రత్యక్షీకరణ ప్రస్ఫుటంగా ప్రతిబింబించింది. జనక్‌పూర్‌లో ఉన్న అసీఫాబాద్‌జిల్లా సెంట్రల్ జైలులో 400 మంది ఖైదీలతో ప్రత్యేక సమావేశం జరిపి, అవతారుని ప్రాశస్త్యంపై మేము వివరించి చెప్పటం జరిగింది.

బాబా శతయంతి సందర్భంలో ద్వితీయ భాగంగా 9-10-93 నుండి 16-10-93 వరకు రాష్ట్రపర్యటన, విశాఖపట్నం విజయనగరం శ్రీకాకుళం జిల్లాలలో జరిగింది. విశాఖపట్నం, భీమునిపట్నం, పార్వతీపురం, బొబ్బిలి, సాలూరు, రాజాం, సారధి, విజయనగరం పాలకొండ, పూతికపేట, చీపురుపల్లి, కల్లాల, నివగాం, శ్రీకాకుళం, మెహెర్‌బాబా సెంటర్లు సందర్శించి శతజయంతి వేడుకల సమాచారం సేకరించాము. బాబా సందేశాలపై ప్రసంగాలు జరిగాయి. ఈ పర్యటనలో విశాఖపట్నంలో శ్రీఎస్.రాధాకృష్ణమూర్తి, చెట్టు శివప్రసాద్, విజయనగరంలో శ్రీ డి.వెంకటరావు, టి. పద్మనాభం, అఘోరపతి, శ్రీకాకుళంలో శ్రీ సి.వై. చింతామణి, ఎన్. సత్యనారాయణ తదితరులు, అమితో త్సాహముగా నిర్వహించిన ఏర్పాట్లు మా జీవితంలో మరువలేని

మధురానుభూతులుగా మిగిలిపోయాయి.



ఇదే బృందంతో తృతీయ భాగంగా 6-11-93న నూజివీడు, 7న చల్లపల్లి, మచిలీపట్నం సెంటర్లు పర్యటించి ప్రత్యేక సమావేశాలు జరిపారు. 10-11-1993న ఏలూరు, గొల్లగూడెం, రామచంద్రాపురం, గోపాలపురం, నల్లజర్ల మెహెర్ సెంటర్లు సో. కె. హరనాధబాబు ఏర్పాటు చేసిన వాహనముపై పర్యటించి ఆ మర్నాడు, 11వ తేదిన విజయరాయ్ సెంటర్ కార్యక్రమంలో పాల్గొని రాత్రికి ఏలూరు సెంటర్ కార్యక్రమంలో కూడా పాల్గొన్నాము. నాల్గవ భాగంగా 4-11-1993 కాకినాడలోను రాత్రికి రాజమండ్రిలోను 5న మండపేటలోను జరిగిన ప్రత్యేక కార్యక్రమాల్లో పాల్గొన్నాము. సో. కె. సుబ్రహ్మణ్యేశ్వరరావు గారు మా పర్యటనకు చక్కని ఏర్పాట్లు చేసారు. తిరిగి నేను రాఘవులుగారు కలసి 13వ తేదిన సికింద్రబాద్ రైల్లో వెళ్ళాము. సో. యం.బి.జి. శాస్త్రిగారు తదితరులు హార్ధిక స్వాగతం పలికారు. ఆయన ఏర్పాటు చేసిన ప్రత్యేక కార్యక్రమంలో పాల్గొన్నాము. 14వ తేదిన జూబ్లిహిల్స్ ఆంధ్రా సెంటర్‌లో జరిగిన వార్షికోత్సవ వేడుకల్లో పాల్గొన్నాము. 12-12-93 న గుంటూరు సెంటర్‌లో జరిగిన కార్తీకసమారాధన కార్యక్రమంలో మేము ఇరువురము పాల్గొని బాబా శతజయంతి వేడుకలు గురించి ప్రసంగించాము.

1994 అక్టోబర్ 14న మా దంపతుల షష్టిపూర్తి మహోత్సవాన్ని మా పిల్లలు విజయవాడలోని మా కుమారుడి ఇల్లు అనిత అపార్టుమెంట్స్‌లో వైభవంగా జరిపారు. రాజా ఎం. ఆర్.అప్పారావు సప్తవర్ణ పతాకావిష్కరణను స్వామి సత్యప్రకాష్ ఉదాసీన్ గారి సారధ్యంలో జరిపారు. డా. జంధ్యాల శంకర్ గారు జ్యోతి ప్రజ్వలన చేశారు.




ముఖ్య అతిధిగా సో. బి. రామకృష్ణయ్యగారు పాల్గొన్నారు. సో. ఎ.వి.రాఘవులు గారి నిర్వహణలో మెహెర్ ప్రేమిక సహవాస్ జరిగింది. విజయవాడ, నూజీవీడు, ఏలూరు, సెంటర్లవారు బాబా ప్రార్ధనలు చేయగా గుంటూరు సెంటర్ కె. కనకయ్య గారు అష్టోత్తర శతనామ పూజ నిర్వహించారు. నా కుమారుడు కోడలు కలసి దంపత పూజ నిర్వహించారు. అనంతరం వేద పండితులచేత వేదపఠనం చి॥ జోత్స్న చేతన, అరుణ, యామినిలచే గీతా పఠనం జరిగినవి. అనంతరం బైబిల్, ఖురాన్,



మెహెర్ ప్రవచన పఠనములు జరిగాయి. దాదాపు రాష్ట్రం నలుమూలలనుండి బాబా ప్రేమికులు హాజరైనారు. అభినందనలు, ఆసీస్సులతో జరిగిన సభలో అందరికి మెమెంటోలు అందిచబడినవి. నాకుమారుడు డా. జి.వి. పూర్ణచంద్ వందన సమర్పణ చేస్తూ తన తండ్రి యెడల చిన్నతనము నుండి భయభక్తులు ఉండేవని ఆయన క్రమశిక్షణవల్లే తనలో సేవా భావం అలవడిందని ఆనాడు పవిత్రమైన దసరా పండుగ రోజైనప్పటికి అంతమంది శ్రేయోభిలాషులు వచ్చి షష్టిపూర్తి కార్యక్రమంలో పాల్గొని ఆశీస్సులం దించారంటే తన తండ్రిపై వారికున్న అపూర్వమైన అనురాగం, ప్రేమ ఎంత వున్నతమైనదో విధితమౌతుందంటూ తన హర్షాన్ని ప్రకటించి అందరికి కృతజ్ఞతలు తెలిపారు. అనంతరం ప్రేమ విందు జరిగింది.

అప్పటి నుండి బాబా సేవా కార్యక్రమాల్లో గడుపుట నాకు నిత్యకృత్యమైంది. రాష్ట్ర సందర్శకుల పాశ్యాత్యులతో పాటు, ప్రముఖ బాబా ప్రేమికులు, మండలి సభ్యులు బాబా ట్రస్టులోని ట్రస్టీలు, చేసే ఆంగ్లప్రసంగాలను తెలుగులో అనువదించి చెప్పే అదృష్టం నాకు అనేక సార్లు లభించింది. నా రచనా వ్యాసంగానికి, ఆంగ్ల ప్రసంగాలను తెలుగులో అనువదించి చెప్పే నావాధ్గాటికి బాలనాటుగారు ముగ్ధులగుటవల్ల నేను ఆయనకు మరింత చేరువైనాను. తరచుగా ఆయన చెప్పే తన అనుభవాలు నారచనా శైలిలో మరింత మెరుగులు దిద్దే అనుభవాన్ని ఇచ్చాయి. ఆయన కావాలనే తన అపూర్వ దర్శనం 5వ భాగాన్ని అప్పటికి ఇంగ్లీషులో ముద్రించబడక పోయినా, టైపుచేసిన ప్రతిని పంపి తెలుగులో నాచే తర్జుమా చేయించమని సో. చింతా సర్వారావు గారిని కోరారు. అటువంటి వాత్సల్యం చూపిన బాలనాటుగారికి నేను సర్వదా కృతజ్ఞుడను.

సమాధి అనంతతార పుస్తకము విషయంలో కూడా ఆపుస్తకాన్ని నేనే అనువాదం చేయాలని ఆకాక్షించి దాని బాధ్యతను ఆయన నాకు అప్పగించారు. మెహెరాజాదుకు నన్ను పిలిపించి స్వయంగా చర్చించి నిశితమైన సూచనలు ఇచ్చి ఫారిన్ ప్రింటుకు తీసిపోకుండా ఎంత ఖర్చు అయినా సరే ధీటుగా ముద్రించమని చెప్పారు. ఆంధ్రా సెంటర్ అధ్యక్షుడు చింతా సాయిబాబాకు కూడా ఉత్తరము వ్రాసి ఈ పుస్తక ప్రచురణలో తీసుకోవలసిన జాగ్రత్తలు తెలిపారు. దాని ఖర్చు క్రింద తనవంతు విరాళంగా రూ. 10,000/-ల పారితోషకం పంపారంటే అపుస్తకం యొక్క ప్రాముఖ్యత ఏమిటో తెలుస్తుంది. దానిలోని సమాచారాన్ని ఆంధ్రులకు అందించాలన్న తపన ఆంధ్రులయందు ఆయనకున్న అభిమానం విధితమౌతుంది. ప్రాంతీయ భాషలో బాబా సాహిత్యాన్ని

అందించాలనే సో. మణిగారు కూడ ఆమె వ్రాసిన దేవుడన్నయ్య పుస్తకాన్ని తెలుగు తర్జుమా చేసే బాధ్యతను నాకు ఒప్పగించిన విషయము అందరికి తెలుసు.

ఆకాశవాణి దూరదర్శన్ కార్యక్రమాల ప్రసారములలో మెహెర్ బాబా అందించిన ప్రవచనములు ప్రసారం చేయించాలని చాలా సార్లు ప్రయత్నం చేసాము. చివరకు 1994 బాబా జన్మదినోత్సవము నాడు నేను చేసిన యుగవతారుని చరిత్ర ప్రసంగాన్ని ఆకాశవాణి విజయవాడ కేంద్రం ద్వారా నా అనారోగ్యం వల్ల సో॥ జి. సుబ్బలక్ష్మి చదువగా 25ని.ల పాటు ప్రసారం చేసారు. అలాగే 1996 లో 97లో 2000 మిలీనియంలో నాల్గుసార్లు నా ప్రసంగములు ప్రసారమయ్యాయి. 2003 అక్టోబరు 6, 13,20,27 తేదీల్లో సూక్తిముక్తావళి కార్యక్రమాల్లో బాబాపై నేను చేసిన ప్రసంగములు ప్రసారములు కాగా పలువురి అభిమానాన్ని చూరగొన్నాయి. అలాగే 2003 ఫిబ్రవరి జన్మదినోత్సావాల్లో విజయవాడలో జరిగిన14వ తేది కార్యక్రమాన్ని విజయవాడ దూరదర్శన్ వారు చిత్రీకరించి 7 ని॥ల పాటు ప్రసారం చేయటం విషేషం.

బాబా సేవకు అంకితమై పూర్తి కాలం వెచ్చించి అలుపు ఎరుగక కృషిచేస్తూ కుటుంబభాధ్యతలు విస్మరించానో ఏమో ఆయన ఆస్థికి కస్టోడియన్ అయిన నన్ను ఆయన మేల్కొలిపినా బాబా నామాస్మరణలో మాత్రం నేను పరధ్యానంలో పడిపోయాను. ఆరోగ్యరీత్యా కలిగే శారీరక మానశిక బాధలను బాబా నాకు ఇచ్చిన నజరానాగా స్వీకరించలేక పోయాననిపించింది. శాశ్వతానందానికి దారితీసే బాబా అభయం నాకు గుర్తువున్నా 1994లో తీవ్రమైన గుండెపోటు వచ్చినప్పుడు శారీరక బాధ యెంతగావున్నా మానశికంగా మాత్రంగా వుల్లాసంగా గడిపే శక్తిని బాబా నాకు ప్రసాదించారనుట నిస్సందేహం. 2000 మిలీనియంలో మళ్లీ గుండెపోటు రావటం వల్ల కదలలేని పరిస్థితిలో వున్నప్పటికీ అవతార్ మెహెర్ పత్రిక ప్రచురణకు ఏ అవాంతరం లేకుండా అవసరమైన శక్తిని ప్రసాదించారు. డాక్టర్లు ప్రయాణాల్ని నిషేదించిన ఫలితంగా ఇంటిపట్టునే వుండిపోలసి వచ్చింది.



గత నాలుగేళ్ళగా రాష్ట్రంలోని ఏ మెహెర్ సెంటరు కార్యక్రమాలల్లోను పాల్గొనలేకపోతున్నాను. మళ్లీ ఒకసారి అన్ని మెహెర్ సెంటర్లు తిరిగి రావాలని మనస్ఫూర్తిగా కోరుకుంటున్నాను. ఆసుపత్రిలో వున్నప్పుడుకూడా ఈ ఆలోచనలే వచ్చేవి. నాకు శారీరక బాధ ఏమిటో తెలియకుండా చేశారు. బాబా నామం స్మరించగానే ఆ దివ్యమంగళరూపం



ప్రత్యక్షమయ్యేసరికి ఆనందంలో మునిగిపోయేవాడిని డాక్టర్లు నర్సులు కుటుంబసభ్యులు మీ బాధ ఏమిటని ఎవరు అడిగినా ఆమాటలు నాకు వినిపించేవిగాని, బాబా సమక్షంలో మునిగిన తన్మయత్వంలో నాకు బదులు చెప్పేందుకు నోరు పెగిలేదికాదు. చిరునవ్వుతో వారివంక చూస్తూ మిన్నకుండిపోయేవాడిని. బాబా సాహిత్యాన్ని చదివేందుకు, వ్రాసేందుకు మాత్రం బాబా అనుగ్రహించారు. తుది శ్వాసవరకు ఆయన సేవకు అనుమతిస్తారని ఆశిస్తున్నాను.

నా జీవితంలో అనుభవాలన్నీ వ్రాయాలంటే పెద్దగ్రంధమే అవుతుంది. అయినప్పటికీ, నేను ప్రియతమ బాబాను మొట్టమొదటిసారి కన్నులారా చూచి మనసారా ఇచ్చిన అరటిపండు ప్రసాదాన్ని తీసుకొన్న మధురక్షణాలు గడిచి 50 ఏళ్ళు పూర్తి అయిన సందర్భముగాను, మా దంపతుల వైవాహిక జీవితము మొదలై 50 ఏళ్ళు గడిచిన సందర్భముగాను, నాకుమారుడు, కోడలు, కుమార్తెలు, మనుమలు, మనుమరాండ్లు ఈ స్వర్ణోత్సవ వేడుకలు జరుపుతున్నందుకు మాకెంతో సంతోషముగా వున్నది. ఈ స్వర్ణోత్సవ వేడుకలలో ప్రియతమ బాబా మనందరిమధ్య ఇక్కడ ప్రత్యక్షంగా వుండి ఈ కార్యక్రమ నిర్వహణా బాధ్యతను తానే తీసుకుని స్వయంగా పర్యవేక్షిస్తున్నారని చెప్పుటకు నాకు సంతోషముగా వుంది. ప్రియతమ బాబాకు మా జే..జే..లు. ప్రియతముని సన్నిధానంలో ఇంత మంది అభిమానులు, శ్రేయోభిలాషులు, బంధుమిత్రుల మధ్య జరుగుతున్న మా వివాహస్వర్ణోత్సవములో భాగంగా అవతార్ మెహెర్‌బాబా నూజివీడు సెంటరు తరుపున వైవాహిక జీవితపు పవిత్రతగురించి మెహెర్‌బాబా ప్రవచించిన ప్రవచనంపై చర్చాగోష్టిని జరుపుట ఎంతో సమయోచితముగా వున్నది. ఈ గోష్టికి సూత్రదారి డా॥ బి. కేశవరావు గారికి, సంధానకర్త, సో॥ కె. వేణుకుమారికి మరియు చర్చలో పాల్గొంటున్న ఇతరులందరికి మా హృదయపూర్వక ధన్యవాదములు అర్పిస్తున్నాము.

సమయం తక్కువగావున్నా క్లాసిక్ డి.టి.పి., విజయవాడ అధినేత సో॥ సముద్రాల రాజశేఖర్‌గారు ఈ పుస్తకానికి అక్షరాలు కూర్చి సకాలంలో అందమైన పోటోలతో డి.టి.పి. చేసి ఇచ్చినందుకు ధన్యవాదములు అర్పిస్తున్నాము. ఆఖరుగా నూజివీడు సెంటర్‌లోనే పునః ప్రారంభంమైన తొలి చర్చావగోష్టి చర్చనీయాంశాన్ని అందిస్తూ సంక్షిప్తంగాముగిస్తున్నాను.

# వైవాహిక జీవితపు పవిత్రత

ప్రవచనములు మూలం : **మెహెర్ బాబా**

ఆధ్యాత్మిక మార్గంలో బ్రహ్మచర్య జీవితం అనేక ఆధ్యాత్మిక గుణాలను కలిగిస్తుంది. అయితే నిగ్రహముతో కూడిన బ్రహ్మచర్యము అలవడటం చాలా కష్టం. అందుకే వైవాహిక జీవితము బ్రహ్మ చర్యము కంటే ఎక్కువ సహాయపడుతుంది. వివాహ వ్యవస్థలో కామ సంస్కారములు తేలికగా తుడిచి వేయబడగలవు. వైవాహిక జీవితములో సహధర్మచారిణి సాహచర్యములో అనుభవమయ్యే కామభావములు క్రమముగా కామమును తొలగించి, ప్రేమ త్యాగములు అభివృద్ధి చెంది చివరకు పరమాత్మను పొందుటకు సహాయపడుతుంది. కానీ యీ వైవాహిక జీవితంలో ప్రవేశించిన వారు దీనిని ఉపయోగించే విధానాన్ని బట్టి అది సహాయకారిగా లేదా అడ్డంకిగా మారుతుంది. వైవాహిక జీవితం ద్వారా ఆధ్యాత్మిక లాభాలు ఒనగూరుట నిస్సందేహము వ్యాపారభాగస్వామ్యంలో మాదిరి, లాభదృష్టిమాత్రము ఉంటే నిష్ప్రయోజనము భాగస్వాములైన భార్యాభర్తలిరువురూ, ఆధ్యాత్మికతకుపూనుకున్నప్పుడు, అది ఆధ్యాత్మిక ఉద్యమమునకు దారితీస్తుంది.

వైవాహిక జీవితములో రెండు ఆత్మలు అనేక అనుబంధాలు కలిగి ఉండుట వల్ల, కోరికల వల్ల తయారయ్యే సమశ్యలతోపాటు వ్యక్తిత్వ సమస్యలను పరిష్కరించవలసి ఉంటుంది. అందుకే వైవాహిక జీవితము, వ్యభిచారలైంగిక భాగస్వామ్యము కంటే భిన్నంగా ఉంటుంది. వైవాహిక జీవితములో అనేక విధములైన అనుభాలకు అవకాశముంటుంది. మనస్సులో నిద్రాణమైఉన్న పలుస్వభావాలు సర్దుబాటుచేసుకునేందుకు, ఉత్తమ లేదా అధమప్రయోజనముల మధ్య విచక్షణ చేయుటకు ఎంతో అవకాశం ఉన్నది. పటిష్టమైన వివేకముతో కూడిన పరిశుద్ధత కలిగేట్లు వాటి మధ్య ఉద్రేకతను కలిగించును.

వైవాహిక జీవితము పలు మానవ సమశ్యలను తీవ్రతరం చేయుటవల్ల, ఆజీవితంలో బంధాల్ని కలుగ చేసేవి మరియు వాటి నుండి విముక్తుల్ని చేసే శక్తులకు కేంద్రమై అజ్ఞాన స్థితులు, విజ్ఞాన స్థితులు కుదుట పడే స్థలమవుతున్నది. ఇరువురి భాగస్వామ్యంలో కలగలుపు ఉద్దేశ్యాలవల్ల కలిగే వ్యతిరేకత, సంకుచిత ఆత్మ నశించేందుకు, సత్యాత్మ ఉదయంచుటకు దోహదపడుతుంది. వైవాహిక జీవితము వల్ల రెండు ఆత్మలమధ్యఅనేక విషయములలో సంబంధాన్ని కలుపుతుంది. ఈ సంబంధాలను త్రెంచుకోవటమంటే, జీవితమంతా అస్థిరముపాలుచేసి పాడు చేయటమన్నమాట. అందుకే యీ రెండు ఆత్మలు చిక్కులతో కూడిన సున్నిత పరిస్థితులలో సరిపెట్టుకుని సత్యమైన శాశ్వత అవగాహనను స్థిరపరచుటకు నిజానికి వైవాహిక జీవితము, మారురూపంలో ఉన్న ఒక చక్కని అవకాశం

వైవాహిక జీవితపు ఆధ్యాత్మిక ప్రయోజనము ఆజీవితపు నిత్యవిధానాన్ని నిర్ణయించే

స్వభావముతో ప్రత్యక్ష సంబంధము కలిగివుంటుంది. ఒకవేళ స్వార్ధపూరిత లాభాలపై ఆధారపడితే సకల ప్రపంచానికి వ్యతిరేకమైన స్వార్ధపూరిత భాగస్వామ్యంలోకి దిగజారుస్తుంది. అలాకాక ఘనమైన ఆదర్శాలవలన ప్రభావితమైతే పరస్పరం ఒకరికోసం ఇంకొకరు అధికమైన త్యాగం చేసేందుకు సంసిద్ధులౌతారు. ఈ జంటల ఆత్మలో వసుధైక కుటుంబమంతటికి ఉమ్మడిగా ప్రేమ సేవలు అందించుటకు సాధనముకాగల స్నేహం పెరుగుతుంది. వ్యక్తిపరిణామానికి వైవాహిక జీవితం దివ్య ప్రణాళికతో ప్రత్యక్షసంబంధం కలిగివున్నప్పుడు ఆ వివాహఫలితముగా పుట్టేపిల్లలకు అది పవిత్రమైన ఆశీర్వచనమౌతుంది. ఆపిల్లలకు పుట్టుకతోటే ఆధ్యాత్మిక వాతావరణములో లీనమయ్యేలాభం కలుగుతుంది.

వైవాహిక జీవితము పుట్టే పిల్లల వలన పవిత్రవంతమై భాగ్యవంతమౌతుంది. తల్లి దండ్రుల వైవాహిక జీవితము వల్ల పుట్టే బిడ్డలు లాభం పొందితే ఆ బిడ్డలను కన్నందుకు తల్లి దండ్రులూ భాగ్యవంతులౌతారు. వారిలో త్యాగము, స్వాభావిక ప్రేమ అభివ్యక్తమై వృద్ధి చెందుటకు బిడ్డలు అవకాశములు కల్పిస్తారు. తల్లి దండ్రులను ఆధ్యాత్మికముగా వృద్ధిచెందేట్లు చేయుటలో బిడ్డల పాత్ర ప్రముఖమైనది. కనుక వైవాహిక జీవితములో సంతానముకలిగితే వారిని హృదయపూర్వకముగా స్వీకరించాలి. వైవాహిక జీవితంలో బిడ్డలకు ఉన్న హక్కుల దృష్టిలో కుటుంబనియంత్రణ ఉద్యమంగురించి జాగ్రత్తగా పరిశీలించాలి. పరిమిత లాభ దృష్టిలో కాక సంఘశ్రేయస్సును దృష్టిలోవుంచుకొని ఆధ్యాత్మిక లాభాలపై ఆధారపడి నిర్ణయించుకోవాలి. తక్కువ సంతానము కోసం కుటుంబనియంత్రణ సరిఅయినదే అయినా దానికి అనువైన విధానాన్ని ఎన్నుకోవటంలోనే అదివినాశకరమౌతుంది. నియమములేని సంతానోత్పత్తి జీవనోపాది ప్రయత్నాన్ని తీవ్రతరము చేసి సాంఘిక వ్యవస్థలో దుర్భరమైన పోటీ ఏర్పడుతోంది. అదికసంతానమువల్ల తల్లి దండ్రులు తమ బాధ్యతను నిర్వహించుకోలేక పోతారు. ఫలితంగా నేరము, పోరాటము, పేదరికములకు కారణమౌతుంది. అయితే ఈ లక్ష్యాన్ని సాధించేందుకు భౌతిక మార్గాలను ఉపయోగించుట సమర్ధనీయము కాదు.

ఆధ్యాత్మిక దృక్పధంలో కుటుంబ నియంత్రణకై పాటించే భౌతిక మార్గాలు అభ్యంతరకరమైనవి. మానవతాకారణాలవల్ల, ఈ భౌతిక విధానాలు సమర్ధనీయమైన వైనప్పటికీ ఆ మార్గాలు కేవలం బిడ్డలను కని పెంచవలసిన భాధ్యత నుండి తప్పించుకొని తమ కామ వాంఛలు తీర్చుకొనుటకు ఉపయోగించుటవల్ల కామమునకు లొంగిపోయి కామ తృప్తిని పొందలేరు. ఫలితంగా కామదాసులై మనోనిగ్రహము అలవడక, పశువాంఛలకు బానిసలైనైతిక ఆధ్యాత్మిక వినాశనాన్ని కొని తెచ్చుకుంటారు. కుటుంబనియంత్రణా పద్దతుల వినియోగము వల్ల ఆధ్యాత్మిక ధృక్పధం మరుగునపడి తన ఆధ్యాత్మిక ఘనత గుర్తింపును కోల్పోతారు. ఆధ్యాత్మిక-సాధకులైన గృహస్తులు, గర్భధారణానిరోధ సాధనములపై ఆధారపడకూడదు. వారు కేవలం మనో నిగ్రహం పైనే ఆధారపడాలి. మనో నిగ్రహం పిల్లల సంఖ్యను పరిమితం చేస్తుంది.

ఆధ్యాత్మిక వినాశనం నుండి కాపాడుతుంది. మనో నిగ్రహమును విచక్షణతో అభ్యసించుట ద్వారా మానవుడు కామమునుండి శాంతికి, బంధము నుండి విముక్తికి పశుత్వము నుండి పవిత్రతకు అధిగమించగలుగుతాడు.

పిల్లలను కనీ, పెంచే బాధ్యత తల్లిదండ్రులు ఇరువురిపైన ఉన్న ఉమ్మడి భాధ్యత. మనోనిగ్రహం సడలితే పురుషునికంటే స్త్రీ ఎక్కువగా కష్టపడాలి. స్త్రీ కని,పెంచి, పోషించి, లాలించి అమితానందం పొందుతుంది.తండ్రి బిడ్డలను చదివించి పెంచుటలో బాధ్యత వహిస్తాడు. వైవాహిక జీవితంలో భాగస్వాములు తమ బాధ్యతలను చక్కగా గుర్తించిన యెడల బాధ్యతారహిత్యము పోయి సడలని మనోనిగ్రహం అలవడుతుంది. పిల్లలు అక్కర్లేదనుకునే వ్యక్తి బ్రహ్మచారిగా వుండిపోవటమే ఉత్తమ మార్గము. ఆధ్యాత్మిక దృష్టిలో నికార్సయిన బ్రహ్మచర్యం అత్యుత్తమము. దీనిని పాటించలేని వారు వ్యభిచారానికి ఆహుతి అయ్యేకంటే వివాహము చేసుకోవటమే శ్రేయస్కరము. వైవాహిక జీవితములో పశువాంఛను అరికట్టుటను నేర్చుకొనవచ్చును. ఒకవేళ నిగ్రహము అలవడకపోతే ఆ దంపతులు సంతాన నిరోధక సాధనముల ద్వారా అడ్డుకొనుటకు బదులు ఫలితాన్ని ప్రకృతికి వదిలిపెట్టుట మంచిది.

ఆధ్యాత్మిక దృష్టిలో కుటుంబనియంత్రణను మనోనిగ్రహము ద్వారా తప్ప మరే ఇతర మార్గాల ద్వారా పాటించరాదు. సంతాన నిరోధక సాధనమును వినియోగించటవల్ల ఆత్మనిగ్రహము అభివృద్ధికి హానికరమై ఆధ్యాత్మికాభివృద్దికి వినాశకరమౌతుంది. వైవాహిక జీవితం ప్రారంభ దశలో భార్యాభర్తలిరువురు కామంచేత, ప్రేమ చేత కూడా పరస్పరం ఆకర్షితులౌతారు. కాలక్రమంలో వారు ఇరువురు ఎరుకతో కూడిన పరస్పర సహకారంతో కామ భావాన్ని తగ్గించి ప్రేమ స్వభావాన్ని పెంపొందించుకోగలుగుతారు. ఈ పవిత్రమైన వైవాహిక విధానములో కామము చివరకు నిర్మల ప్రేమకు దారితీస్తుంది. సుఖదుఃఖాలను పరస్పరం పంచుకుంటూ తొలిరోజులలోని స్వార్థం, ఈర్ష్యలతో కూడిన ప్రేమ నిస్వార్థంతో కూడిన విశాల ప్రేమగా మారే వరకు ఆభాగస్వాములిరువురు ఉరకలు వేస్తూ పరిశుద్ధ ప్రేమ నుండి శుద్ధతర ప్రేమకు పురోగమిస్తారు. అప్పుడు గురువు యొక్క స్పర్శ మాత్రము చేత శాశ్వతమైన పవిత్ర జీవనాలయమునకు లేవనెత్తబడతారు.

**అందరికి మా దంపతుల హృదయపూర్వక జైబాబా.**

ప్రియమైన బాబాసేవలో

బుధజన విధేయులు

నూజివీడు

16-11-2003

**జి.వి.జి.కె. చంద్రమౌళీశ్వరరావు**

**జి.ఎస్. ప్రసూన**

# ఆహ్వానము





మా అమ్మ, నాన్న

**ప్రసూన, మెహెర్‌చంద్ర**

**వివాహ స్వర్ణోత్సవం** సందర్భంగా

ది. 16-11-2003 ఆదివారం ఉదయం 10 గంటలకు

## "బాబా చర్చాగోష్ఠి"

(వైవాహిక జీవిత పవిత్రత)

వేదిక : మెహెర్ నిలయం, నూజివీడు.

మీ రాక మా కోరిక



ప్రియతమ
మెహెర్ ప్రభువు ఆశీస్సులతో.......

డా|| జి.వి. పూర్ణచంద్, అరుణాదేవి
శ్యామల, కణ్ణన్
శ్రీలక్ష్మి, రఘువరప్రసాద్
మనుమలు - మనుమరాండ్రు

**అవతార్ మెహెర్‌బాబా కి జై !!**

## Check List

| | | | |
|---|---|---|---|
| **Book Number** | GNP01C107 | **Date** | 11/11/20 |
| **Front Cover** | Yes | **Back Cover** | Yes |
| **Blank Pages** | NO | | |
| **Missing Pages** | NO | | |
| **Prepared** | Mounika | **Scanned** | K Devi |
| **BOOK SIZE** | H 8.3 W 5.5 | **Pages** | 53 |